# జన్మరాహిత్య ప్రబోధిని

(ఆధ్యాత్మిక గ్రంథము)



గ్రంథకర్త :

పందిరి శ్రీశైలము B. Sc.

Endowments Executive officer

ప్రతులు — 1000
సర్వహక్కులు గ్రంథకర్తవి.

ప్రచురణ :
శ్రీ పందిరి మునలయ్యగారి వృద్ధాశ్రమము
గుండ్లపాడు
పల్నాడు తాలూకా, గుంటూరుజిల్లా

ముద్రణ :
వెల్ కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్
బ్రాడీపేట, గుంటూరు—2



పందిరి శ్రీశైలముగారు, ముసలయ్య దేశిక స్వాములవారు, వీరనారాయణగారు.

# అంకితము

ఇట్టి జగజ్జననివైన నీ దివ్యపాదపద్మములకు

నా ప్రియతనూజ పందిరి జగజ్జనని

సీతాదేవి స్మృతి చిహ్నముగా

— రచయిత

# ప్రార్థన

ఓ కరుణామయివగు వాసవాంబా ! ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండు వరకును మా వాక్కుతోడను, కాయముతో గూడిన యే క్రియలతోనైనను యేప్రాణికిని హింస కలుగకుండునట్లుగను, మేము సదా ఉపకారము చేయులాగునను, సద్బుద్ధిని దయచేయుము.

ఓ లోకపావనీ ! ప్రణవ స్వరూపిణీ ! నీ పాదపద్మముల యందే నా మనస్సు సదా చేరి యుండునట్లను గ్రహింపుము. మరణకాలమునందు నీ సంస్మరణ గలిగిన చాలునందురే గాని, కఫ వాత పిత్తములు కంఠమున గ్రమ్ముచుండెడి నయ్యెడ నీ సంస్మరణ గలుగుట బహుకష్టము. కావున యెల్లవేళల నీ స్మరణయే కలుగునట్లాశీర్వదింపుము.

ఓ శాంతి స్వరూపిణీ ! పరమ పావన పుణ్యమయీ ! నీ సాన్నిధ్యమున కేతెంచుట కవసరమగు భక్తి, జ్ఞాన, వైరాగ్యములను, శక్తియుక్తులను బ్రసాదించి యీ జన్మమునందే యీ జనన మరణ చక్రమునుండి విముక్తిని కలుగజేయుము. ఈ నా నిశ్చిత కార్యక్రమునుండి మనస్సును చలింపనీయక సుస్థిరత్వమునొసగి సదా కాపాడుము.

ఓమాతా ! నీకన్న నాకెవ్వరును దిక్కులేరంచు నిన్నే పలుమారులు ప్రార్థింతును. రక్షింపుము. రక్షింపుము. రక్షింపుము. అంబా ! నమస్తే నమస్తే నమస్తే నమః

ఈ ప్రార్థనను దినదినము ప్రతి మంగళ శుక్రవారములలో ప్రాతః కాలమున పఠించిన వారు ధన్యజీవనులు కాగలరని మనవి

## జగజ్జనని ధ్యానము

ఓం సర్వస్వరూపే సర్వే శివాసర్వాలోక నమస్కృతే ।
భయేభ్యస్త్రాహినో దేవి జగన్మాతా నమోస్తుతే. ॥

## గురు ధ్యానము

ఓం గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మై శ్రీగురవేనమః॥

## అంకితము

సర్వ జగజ్జననివైన నీ దివ్యపాదపద్మములకు
నా ప్రియతనూజ పందిరి జగజ్జనని
సీతాదేవి స్మృతి చిహ్నముగా

రచయిత —

# శ్రీ వాసవీ ధ్యానము

మహీ నిరంకుశమౌ నధర్మమ్ము నణప
తివిరి నూట రెండగు గోత్రభవులునైన
విజ్ఞులౌ వైశ్యదంపతుల్ వెంటనంట
అగ్నికాహుతి యైతివా ! అమరమూర్తి !!

నీ వొసంగిన ధర్మంబె నిఖిలజగతి
కరయ నాదర్శమైన దోయమ్మ నేడు
కలి జనాళికి మోక్షమ్ము గలుగ జేయ
నవతరించిన కన్య ! ఓ ఆదిదేవి !

శ్రీశ గౌరీశ వాణీశ సేవ్యపాద
విభవ శోభిత వౌచు కన్వెందొవర్చు
శ్రీ పరాశక్తి ! కన్యక ! చిత్స్వరూప !
అంబ ! వాసవి ! నినుగొల్తు ననవరతము.

నేనె లక్ష్మిని గౌరిని నేనె వాణి
ననుచుతెల్పగా నాల్గు హస్తాంచలముల
అబ్జమును శూలమును గ్రంథ మభయముద్ర
లను ధరించిన నీపూజ లొనరజేతు.

ఆర్యవైశ్యాన్వయంబున నవతరించి
శాంత్యహింసల తోడనే శత్రువులను
తగ జయించెడి నూతనధర్మరణము
జగతికిన్ నేర్పితివి జగజ్జనని నీవు !!

# వంశక్రమము

శ్రీ భారత ధాత్రికనుం
గై భాసిలు పల్లెనాట నతులిత కీర్తిన్
వైభవమున దివికెనయై
శోభిల్లును గుండ్లపాడు చూడ్కికి విందై 1

ఆ యూర గురులు లోక
శ్రేయః కాంక్షులు వణిగ్వరిష్ఠులు సతతా
మ్నాయ పఠన పారన శో
భాయుక్తులు ముక్తులైన పందిరివారల్. 2

అట్టి పావనవంశంబు నందు పుట్టి
రామయాఖ్యుండు సర్వగౌరవ్యుడగుచు
ఆత్మవిద్యావిదుని వేంకయార్యుడనెడు
తనయునిం గాంచి పరమ పదంబుఁ జేరె. 3

ఆ వేంకయార్యునకు వం
శావనదక్షుడయి వీరయాఖ్యుం డుదితుం
డై వరగుణసంపత్సం
భావిత సతి నాగమాంబఁ బరిణయ మయ్యెన్. 4

సదయ లవ్వారి సుతచతుష్టయము నందుఁ
బరగు కోటయ్య ముసలయ్య బ్రహ్మచర్య
ఘనులు నింక వీరాస్వామి యనెడు వాడు
వీరనారాయణుండు సంసార ధనులు 5

జనకుని మించిన వాడగు
ననెడి సుతుల్ గొనుచు జనన మందెను భక్తా
గ్రణియగు వీరాస్వామికి
ననఘుడు మార్కొండయాఖ్య డనుగు సుతుండై. 6

సద్గురుండగు ముసలయ్య స్మారకముగ
తివిరి యాషాఢ బహుళ ద్వితీయ నాడు
శిష్యతతియు మార్కొండయ్య చేయుచుందు
రనుపమారాధనమ్ముల నధికభక్తి. 7

అమల గుణయుతుల్ సత్యదయాప్రపూర్ణు
లైన సీతమా వీరనారాయణులకు
సుతుడు శ్రీశైలమును సుతల్ సుబ్బమాంబ
శేషమయు భ్రమరాంబయుఁ జెలగినారు. 8

ఇమ్మగఁ బసుపుం గుంకుమ
లమ్మఖ మందున వెలుంగ నైదువగా నీ
తమ్మ జగజ్జననిని నీ
తమ్మను హృది నిల్పి శ్రీ పదమ్ముల గలవన్. 9

తల్లియుఁ దండ్రియున్ గురువు దైవము తానయి తల్లిలేని త
మ్మల్లన పెంచి వృద్ధికొఱకై సుఖపూరితమైన జీవిత
మ్మెల్లను ధారవోసి తమ నింతటి వారిగఁ దీర్చినట్టి యా
చల్లని తండ్రిలో జనని ఛాయల గాంతురు వారు నల్వురున్. 10

ఆదర్శ జీవియై శ్రీ
పాదుడు నారాయణుండు భవదూరుండై
యాదటను జ్యేష్ఠ బహుళ
ద్వాదశి శ్రీరామచంద్రు పదములఁ గలసెన్. 11

మఱువగ లేక తండ్రి యభిమానము, నాగురు దివ్యబోధనల్
మఱువగ లేక; రాము ఘనమంత్ర మొసంగిన మౌనిపుంగవున్
మఱువగ లేక; రాగకలనన్ మఱపించిన మాతృదేవినిన్
మఱువగ లేక; పూజల ఋణంబును దీరుచు నా సుతుండొగిన్. 12

జనకు నారాధనమ్ముల సల్పునపుడు
వేదపండితపూజలు, విపులదాన
ధర్మములఁ జేసి జన్మ సార్థకముగాగ
ఘనుడు శ్రీశైల మనుపమఖ్యాతి గాంచె. 13

వాలిన భక్తినేసురలఁ బ్రార్థనఁజేసెనొ ; యెన్ని నోములా
శైలసుతన్ దలంచి యవిశంబును నోచెనొ ; యెన్ని పుట్టలన్
బాలను బోసెనో ; సుకృతవంతుడు పుణ్యగుణాన్వితుండు శ్రీ
శైలము భర్తయై తనరె సద్గుణలక్ష్మికి నాగలక్ష్మికిన్. 14

మూడు పూ లారు కాయలై పొలుచు నట్టి
వారి భవ్యదాంపత్యాన ప్రభవమైరి
కూతు లిర్వురు కొమరు డొక్కరుడు బంధు
వర్గ మానందమున పరవశత జెంద. 15

కన్నా! యన్నయనుంగు పిల్పునకు వెన్కన్ గల్గు ప్రేయోరప
మ్మన్నేరంగని తల్లిదండ్రుల ఋణమ్మున్ దీర్ప శ్రీశైల మే
తన్నామంబులతో జగజ్జనని సీతాదేవి శ్రీదేవి శ్రీ
మన్నారాయణుడంచు మిక్కుటపు ప్రేమన్ బిల్చు నాపిల్లలన్. 16

చేతము భక్తియుక్తముగఁ జేసి మహోన్నతవేదరూపమా
గీతను ముద్దు పల్కు లొలికించి పఠించుచు చిన్ననాటనే
ధాతృకరోరవృత్తిఁ దలిదండ్రుల గుండెల చిచ్చువెట్టి యా
సీతమ దైవ దుర్ఘటన చేత ప్రమాదమునన్ గతింపగా. 17

పుట్టిన నాటనుండి తనువున్ భగవంతుని సేవయందె తా
కట్టిడి తత్వతత్పరత గాంచి మహాత్ముల గొల్చి జ్ఞానియై
గుట్టగు నాత్మవిద్య ప్రజకున్ వివరింపగ బూనినట్టి తా
నిట్టె ఘటించె నొక్క కృతి వించిన పుత్రిక కాత్మశాంతికై. 18

అఖిలసంపదల కిరవై యమలకీర్తి
భరితమై పుత్ర పౌత్ర ప్రవర్ధమాన
మై సమ స్తగుణాన్వితమై జగాన
వరలు గావుత పందిరి వంశమెపుడు. 19

— ం —

# ఉపోద్ఘాతము

మహానుభావులారా !

ఈ చిన్నిపుస్తకములోని విషయములన్నియు కేవలము మహనీయ ప్రోక్తములును భక్తి జ్ఞాన వైరాగ్యములను పెంపొందించునదై యున్నది. నేను పండితుడను కాను అల్ప జ్ఞుడనయిన నాలో, సత్పురుషుల సాంగత్యము జ్ఞానజిజ్ఞాసను కల్గించినది. సద్గురువులు, బ్రహ్మచారులు యోగనిష్ఠాపరులు నైన నా పెదతండ్రులు శ్రీ పందిరి కోటయ్యా, శ్రీ పందిరి ముసలయ్యాగార్ల దివ్య ప్రభావమున నా హృదయక్షేత్రమున జ్ఞానబీజములు నాటుకొన్నవి. నాకీ తనువును ప్రసాదించిన నా తండ్రిగారు శ్రీ పందిరి వీరనారాయణగారి కృపారస విశే షముచే నాలో జ్ఞానబీజములు అంకురించి తీగలు సాగినవి. ది 23–1–'76న నా జీవితమున కలిగిన అనూహ్యా సన్నివేశము వలన విషాదావేశములు నా జ్ఞానలతను ఫలింపజేసినవి. ఆఫల రూపమే యీ చిన్నిపుస్తకము.

1976 వ సంవత్సరము జనవరి 23వ తేదీ నా జీవితమున అంతులేని అంధకారము నొకవైపునను, అద్భుతజ్ఞాన ప్రకా శము మరియొక వైపునను కల్గించిన ఆశ్చర్యకరమగు దినము. ఆనాటి ఉదయమున మా కుటుంబములోనివారగమందరమును భుజించి విశ్రాంతి తీసుకొను సమయమున ఆరు సంవత్సరముల వయసుగల నా పెద్దకుమార్తె పాఠశాలకు పోవుటకు బయులు

చేరి, ఆకస్మికముగ లాగి రూపమున అరుదెంచిన మృత్యువు నోటబడి అసువులు బాసినది. ఆనాడంతయు అపారమగు దుఃఖమున నేను మునిగియుంటిని నాటిరాత్రి రెండుగంటల సమయమునుండి నాలో ఎడతెరపిలోని శోకము ముప్పిరి గొన్నది. ఆలోచనా పరంపర లెగయసాగినవి. నాబిడ్డ యింత చిన్న వయసులోనె అకస్మాత్తుగా మరణించుటకు కారణ మేమిటి? ఏ కర్తవ్యము నిర్వర్తించుట కామె పుట్టినది. జీవి తములో అడుగైన పెట్టకముందే ఆమె ఎందులకు మరణించి నది, మానవులు ఏ ఉద్దేశ్యమునూ, కారణమునూ లేకయే పుట్టుచు చచ్చుచు నుందురా? లేక ప్రతిమానవుని చావు పుట్టుకలకు కారణము కలదా! యిట్టి అనేకములగు ఆలోచన లతో నా హృదయము మానసము అల్లకల్లోలిత మగుచున్న ఆ సమయమున సత్పురుషుల వాక్యమొకటి నాకు వినబడి నది "పిల్లలు ఋణానుబంధ రూపములు," "పిల్లలు ఋణాను బంధ రూపములు" ఆ మాటలు నాచెవిలో రింగుమని మ్రోగ సాగినవి. ఈ బాలికకు నేను ఏమి ఋణపడియున్నాను. నాకు యిట్టి దుఃఖమును కలుగజేయుటకు హేతువేమిటి? అను ఆలోచనలతోనే నాలుగురోజులు గడచినవి. దినదినమునకు దుఃఖ మినుమడించినది. నాలో రేగి ఆలోచనలతో నాకు పిచ్చిపట్టినట్లయినది. ఓ భగవంతుడా! పుట్టినవారు చచ్చుట తప్పనిసరి యైనప్పుడు నీవు ఎందులకు యీ జీవులను పుట్టించు చున్నావు? పుట్టించినవాడవు ఆ రెండ్లయినా నిండకముందే

నాబిడ్డను ఎలా తీసుకొని పోయినావు. ఇట్టి అకాల- మరణమును కలిగించుటకు నాబిడ్డ చేసిన నేరమేమిటి ? నేనొనరించిన పాపమేమిటి ? నాకు సమాధానము చెప్పుము. నిష్కారణముగా నన్నెందులకు యిట్లు శిక్షించినావు ? జవాబు చెప్పకున్న నేనూరుకొనను. నిన్ను విడువను. అని ఏమేమో పలుపలు విధముల నాలో నేను ప్రలాపములు లాడుచుఎట్టకేలకు కన్ను మూసితిని. అది ఐదవనాటిరాత్రి, ఆనాటి రాత్రి నిద్రావస్థలో నుండగా నా ముద్దుబిడ్డ నాకు కనిపించినది. "నాయనా! నేను నీ తల్లిని నేను మరణావస్థలో నున్నప్పుడు ఒక్కగాను ఒక్క బిడ్డవైన నిన్ను చివరిసారిగా మనసార ముద్దుపెట్టుకొన వలయునను బలీయమైన కోర్కెతో ఎన్ని విధముల నిన్ను బ్రతిమాలి పిలచినను నీవు నాదగ్గరకే రాలేదు. నేను ఆ తీరని కోర్కెతోడనె ప్రాణములను విడచితిని. అంత్యకాలమున అంకురించిన నాముద్దు చెల్లించుకొనుటకై నీబిడ్డనైతినని పల్కి అదృశ్యమైనది. అబ్బురమైన యీ స్వప్నము నాటినుండి నాలో ఆరని జిజ్ఞాసను రేపినది. చచ్చిన నాతల్లి తిరిగి నాబిడ్డగా పుట్టుట ఏమిటి ? మానవులకు పునర్జన్మ వున్నదా ! చనిపోయిన పిదప మానవుడేమగును ? ఎంతకాలమునకు తిరిగి జన్మించును ? యిట్టి ప్రశ్నములు అనేకములు నాలో తలఎత్తినవి. వీటికి సమాధానములు తెల్పుకొనవలయునని కుతూహలము కొండంతగా పెరిగినది. నాకు గల్గిన గర్భశోకము అసహనీయము కాసాగినది. చనిపోయిన నాబిడ్డ

సాక్షాత్తు నాతల్లిని పోలియున్నదని యిరుగు పొరుగువారు అనుచుండెడివారు. నాతల్లిని నేను గుర్తుంచుకొనలేని నాల్గు ఐదు సంవత్సరముల పసివయస్సున నేను నుండగనే ఆమె మరణించినది. నాతల్లి పోలికలే నాబిడ్డకు కలుగుటకు కారణమేమి ? అని ఆలోచించితిని ఆరేండ్లయినా నిండని నాబిడ్డకు అపారమగు భక్తి భావము ఏర్పడి యుండుటచూచి మేమందరము ఆశ్చర్య పడెడివారము. గుణింతమునైన సవ్యముగా నేర్వలేని చిన్నవయస్సులో నున్న యీపాప భగవద్గీతయందలి భక్తియోగమును స్వరయుక్తముగా కంఠోపాఠముగ చదువుట ప్రతిదినము ప్రాతఃకాలముననేలేచి దేవతా స్తోత్రములు, మృత్యుంజయ మహామంత్రము, మార్కండేయ కృతస్తోత్రము కంఠస్థముగా పఠించుట, పెద్దలు పండితులైనవారు వచ్చినప్పుడు వారికి ఆనందము కలుగుతీరున పెద్దపెద్ద విషయములు మాట్లాడుచు వారి దీవెనల పొందుటవంటి అనేక విషయములు నా బిడ్డయందు విశిష్టముగ కనిపించుటచే వయసు మించిన యిట్టి తెలివితేటలు యీ బిడ్డకు ఎట్లు వచ్చినవాయని అందరము ఆశ్చర్య పడెడివారము. ఈ విషయములన్నియు నాతల్లియే నాబిడ్డగా పుట్టినదను నమ్మకము నాలో బలపరచ సాగినవి. నా కుమార్తె ఆకస్మికి మరణ మొందిననాడు చేసినపనులు నా నమ్మకమును మరింత ధృఢపరచినవి. నాతల్లి తన అనారోగ్య కారణమున నాకు అన్నము తినిపించు కుచ్చుటకు నోచుకోవ లేదు. నాబిడ్డ నాకు ఎన్నోసార్లు తన చేతితో అన్నము తిని

పించి మురిసిపోయెడిది. మృత్యువు నోటబడు ఆ రోజుకూడ నా చిట్టితల్లి తన చేతితోనే నాకు అన్నము పెట్టినది. ఇల్లు వెడలిపోవుటకు ముందు అనగా చనిపోవుటకు రెండు నిమిషముల ముందు జగజ్జనని యగు శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరి స్తోత్ర మును చెప్పి, నాచే మాతృవందనము చెప్పించుకొని పొరపాటున నేను పలికిన తప్పును తాను సరిదిద్దినది. నాకు నాతల్లి అంత్య కాలమున నేను యివ్వని ముద్దును యీనాడు తీసుకొని తనపని పూర్తి చేసుకొని పోయినదా ! అనుటకు వీలుగా నాచే ముద్దు తీసుకొని బయటకు పోయినది. కనురెప్పపాటులో లారీ ప్రమా దమునకు గురియైనది, కపాలమోక్షము నొంది జీవిని సహస్రా రముద్వార పరమాత్మలో లీనపరచు మహానుభావులకువలె ఆ మెకును శిరస్సు ప్రేలినది. ఇట్టిమృతి "జన్మరాహిత్యమును" గల్గించునని వేదాంత గ్రంథములు పలుకుచున్నవి. ఇట్లేర్పడిన అనేక విసిష్ట విషయములు నాతల్లి పునర్జన్మనంది నాకుమార్తె యయినదనుటకు నిదర్శనము లనిపించినది. మానవజన్మ రహ స్యమును తెలుసుకొనవలయునను ఆకాంక్ష నాలో పరిపూర్ణ ముగ తీవ్రముగ కల్గినది. నా గర్భశోకమును మాపుకొనుటకు యిది యొక్కటియే మార్గమనిపించినది. పలువేదాంత గ్రంథ ములను పరిశీలించుట జరిగినది. అనేకులగు పెద్దలతో యీ విషయమై చర్చలు పలుమారు జరిగినది. నాకు తెలియని ప్రశ్న లకు తగిన సమాధానములను పొందుటకై నేను సల్పిన కృషి ఫలితముగా నాకందిన విషయములను ఒక గ్రంథరూపమున

పొందుపరచి, నాయందిట్టి జ్ఞానజిజ్ఞాసను కల్గించిన నా చిన్నారి బిడ్డ స్మృతి చిహ్నముగా ఆ చిట్టితల్లి ఆత్మశాంతికై సహృదయ లోకమున కందించవలయునను కోరికతో ఈ పుస్తకమును ముద్రించుచున్నాము. ఈ గ్రంథ ముద్రణమునకు వలయు ఆర్థిక సహాయమును దివ్య శ్రీ పందిరి ముసలయ్యగారి "వృద్ధాశ్రమ" నిర్వాహకులును, ఆశ్రమ శిష్యవర్గమువారును, అభిమానులును అందించినారు. వీరందరికిని నాహృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు
రచయిత

— పందిరి శ్రీశైలము, B. Sc.
ఎండోమెంట్సు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు.

# గ్రంథావిష్కరణము

ది 2-12-1976న నాగార్జునసాగరు హైలాసులో శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీదేవి ప్రతిష్ఠ జరిగినది, పుష్పగిరి పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ జగద్గురు భారతీ స్వాములవారు ఆ ప్రతిష్ఠా కార్యక్రమములకు పర్యవేక్షకులుగానుండిరి. ఈ గ్రంథ రచనకు మూలకారకురాలగు దివ్యశ్రీ పందిరి జగజ్జనని సీతాదేవి అంతిమకోరిక ననుసరించి అనేకమంది పెద్దలు భక్తుల సహాకారముతో 2వ తేది ఉదయమున 6 గంటలనుండి 11 గంటల వరకు శ్రీవాసవీ మహాయజ్ఞము అత్యంత వైభవోపేతముగ జరుపబడినది. అఖిల భారత వైశ్యచరిత్ర పరిశోధకులు, శ్రీ వాసవీ మహాయజ్ఞ విధాయకులు, యీగ్రంథ పరిష్కర్తలు నైన "విద్యావాచస్పతి" శ్రీ కొల్లిపర పాండురంగారావు గారి ఆధ్వర్యమున 102 యజ్ఞకుండములలో 102 వైశ్య దంపతులచే యీ మహాయజ్ఞము సలుపబడినది. ఆగమ శాస్త్ర పరిశోధకులు మహా విద్వాంసులునగు సాహిత్యరత్న దిట్టకవి శ్రీనివాసాచార్యుల వారు ఋత్విక్కులుగా వ్యవహరించిరి. యజ్ఞానంతరము శ్రీనగరేశ్వర, రాజరాజేశ్వరి, వాసవి కన్యకాపరమేశ్వరీ దివ్య విగ్రహములను జగద్గురువులు ప్రతిష్ఠించిరి నాటిసాయంత్రమున వేలాదిభక్తవరుల కవిపండితశ్రేష్ఠుల సమక్షమున జగజ్జనని శ్రీవాసవి కన్యకాపరమేశ్వరీదేవీ పాద పద్మములకు యీ "జన్మరాహిత్యప్రబోధిని" కృతి సమర్పణము గావించబడినది. అటుపై గ్రంథావిష్కరణ మహాసభ

జరిగినది. వేలాది భక్తవరేణ్యులతో విలసిల్లుచుండిన ఆ సభకు చిన్ని పేరయ్యగారు అధ్యక్షత వహించిరి. ఆ సభా వేదికపై శ్రీయుతులు దరిశి శివరామయ్యగారు, Ch బుచ్చయ్యగారు, గౌరు ఏగయ్యగారు, కొల్లిపర పాండురంగారావుగారు, శనగల సుందరరామయ్యగారు, ఉస్తేపల్లి సదాశివరావుగారు, కొత్తమాసు పున్నారావుగారు, పోలిశెట్టి వెంకటనారాయణ గారు, కామేశ్వరరావు గారు మున్నగు పలువురు పెద్దలు విద్వాంసులును మరియు శ్రీ పుష్పగిరి పీఠాధి పతులును సభా వేదికను అలంకరించిరి.

శ్రీ పుష్పగిరి పీఠాధిపతులు జగద్గురు భారతీస్వాముల వారు తమ పవిత్ర కరకమలములతో యీ చిన్ని పొత్తమును ఆవిష్కరించి, యీగ్రంథ విశిష్టతను గూర్చి సుదీర్ఘముగా ప్రసంగించి, గ్రంథ రచయితనగు నన్ను ఆశీర్వదించి నా జీవితము ధన్యముగావించిరి. తదనంతరము భాషాప్రవీణ శ్రీ శనగల సుందరరామయ్య గారు, ఉస్తేపల్లి సదాశివరావు గారు, మరియు కొల్లిపర పాండురంగారావుగారు యీ గ్రంథ విశిష్టతను గూర్చి ప్రసంగించిరి. ఈ శుభసందర్భమున తెనాలి ఆర్యవైశ్య సంఘమువారు నన్ను సన్మానించిరి. అంతట వాసవీ మహాయజ్ఞ విధాయకులైన శ్రీ కొల్లిపర పాండురంగా రావుగారికి మహామహుల ఆశీర్వచనముతో "మహాయాజి" అను బిరుదమును సువర్ణ పతకము నొసగి సన్మానించిరి. కామేశ్వరరావుగారి వందన సమర్పణముతో సభ ముగిసినది.

రచయిత.



గ్రంథకర్త

పందిరి శ్రీశైలము, B. SC.

ఎండోమెంట్సు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు



ఈ గ్రంథరచనకు మూలకారకురాలు

దివ్య శ్రీ జగజ్జనని సీతాదేవి

ఓం శ్రీ వాసవీం శివాం, అంబాం జ్ఞానసిద్ధి ప్రదాయినీం

ఆర్ష ధర్మ సముద్ధర్త్రీం సుఖదాం తాం నమామ్యహమ్



ఈ చిన్నిపొత్తమునకు
శుభాకాంక్షలనందిస్తున్న ఎండోమెంట్సు అసిస్టెంటు కమీషనరు
పి. నాగిరెడ్డిగారు, డిప్యూటి కమీషనరు T. S. S. N. రాజుగార్లు



గ్రంథావిష్కరణ జరిపిన

శ్రీశ్రీశ్రీ జగద్గురువులు పుష్పగిరి పీఠాధీశ్వరులు,

శ్రీ మదభివోద్దండ విద్యానృసింహభారతీస్వామివారు

శ్రీ శ్రీ శ్రీ జగద్గురువులు పుష్పగిరి పీఠాధీశ్వరులు

# శ్రీమదభినవోద్దండ విద్యా నృసింహ భారతీస్వామివారు

శ్రీ

## నమామి వేదమాతరమ్

చిరంజీవులు శ్రీ పందిరి శ్రీశైలము ఉత్తమ వంశమున జన్మించిన ధార్మికులు, సాత్వికులు, వారు విరామ సమయము లందును ప్రాచీన భారతీయ విజ్ఞాన రహస్యములనెఱిగి తరించుటకై నిరంతరము - జిజ్ఞాసువులై కృషిచేయుచుందురనుటకీ చిన్నిపొత్తమే సాక్ష్యము. ఇది పరిణామమున చిన్నదే యయ్యును ఇందు వివరించుటకు గైకొనిన విషయము మహత్వ పూర్ణము. నేడు వివిధ వ్యామోహములకు గురియై వివిధ సమస్యల నెదుర్కొనుచు భారతీయ సంస్కృతికి దూరులైన వారికి ఉత్తేజము కల్గించుటకు ఇట్టి గ్రంథములావశ్యకములు. ఇందు వివరించబడిన జన్మ, పునర్జన్మ, కర్మ, భక్తి తత్వముల గుర్తెరిగి, అందు కర్మ - భక్తి సాధనల ద్వార ఈశ్వరానుగ్రహము వలన జ్ఞానము, తత్ఫలితముగా జన్మరాహిత్యము సిద్ధించునని గ్రంథములో చక్కగా ప్రతిపాదింపబడినది. శ్రీ శారదాచంద్ర మౌళీశ్వరుల అనుగ్రహమునకు పాత్రులై వీరు చిరాయురారోగ్యైశ్వర్యములతో వర్ధిల్లుదురుగాక !

ఇతినారాయణ స్మృతిః

శ్రీమత్పరమహంస – పరివ్రాజికాచార్య

శ్రీ కేశవ తీర్థస్వామి

శ్రీ రామతీర్థ సేవాశ్రమం

**పిడుగురాల**

జయజయ శ్రీ నృసింహా

సుఖదుఃఖాల ఆశయం – సుఖదుఃఖ రహితమైన సుస్థిరానందమయమైన – ఆత్మజ్ఞానాన్ని కలిగించడమే! జనన మరణముల పరమాశయం – జనన మరణాతీతమైన మహా నిర్వాణ పదాన్ని పొందించడమే!

తన విషాదమును, విషాదయోగంగా, – అవిషాద యోగమును విజ్ఞాన యోగంగా – అవిజ్ఞానయోగమును, ఆధ్యాత్మిక కృతిగా – రూపొందించుకున్న శ్రీ పందిరి శ్రీశైలంగారు ధన్యుడు –

బ్రహ్మాండమైన సూర్యమండలాన్ని తనలో ప్రతిఫలింప జేసికొని, మిలమిల మెరుస్తున్న ఒక చిన్న మంచు బిందువు లాగా – అపార శ్రుతిభోధలను తనలో ప్రతిఫలింపజేసికొని, వెలుగుతున్న ఈచిన్నిపుస్తకం, ఎంతో మనోహారంగా ఉన్నది.

ఈగ్రంథావలోకనం – సాధకలోకానికి, అశోకమైన ఆత్మావలోకనాన్ని కలిగించడంలో, తోడ్పడుతుందిగాక! శుభమస్తు.

ఓం తత్సత్

# అభినందన

నాడు కురుక్షేత్ర సంగ్రామ రంగమున నిలచిన అర్జునకు స్వబాంధవ్య నాశనము జరుగునను భావమువలన విషాదము కల్గినది. ఆ విషాదము వలన వైరాగ్యమును దానిచే నాధ్యాత్మిక తత్వరహస్య మరయుట కనువగు జిజ్ఞాసయునర్వాతయు గల్గినవి. అటులనే చిన్నారిబిడ్డ యొక్క ఆ స్మిక మరణము వలన గల్గిన విషాద వైరాగ్యముల ప్రేగణచే సంకురించిన జ్ఞాన జిజ్ఞాస, శ్రీ పందిరి శ్రీశైలము గారిచే నాధ్యాత్మిక తత్వ రహస్య దర్శనము చేయించినది. శ్రీశైలముగారు అవిరళకృషి గావించి అమూల్యమగు యీ గ్రంథమును రూపొందించినారు. పుష్పగిరి పీఠాధి పతులగు శ్రీ శ్రీ శ్రీ విద్యానృసింహభారతీ స్వాములు, శ్రీ మత్పర హంస పరివ్రాజకాచార్య కేశవ తీర్థ స్వాములు మున్నగు మహానుభావుల ఆశీర్వాభినందనలనందగల్గుటయే, యీ గ్రంథమున పొందుపరుపబడిన విషయ ప్రశస్త్యమునకును దాత్తతకును నిదర్శనము. ఇట్టి యీ పవిత్రగ్రంథమును పరిష్కరించు భాగ్యము నాకు గల్గించి, తామార్జించు చున్న యనంతపుణ్యమున నాకును నొకింత పాలొసగిన సోదరులగు శ్రీశైలముగారిని కృతజ్ఞతాపూర్వకముగ నభినందించు చున్నాను.

"విద్యావాచస్పతి"

కొల్లిపర పాండురంగారావు – చీరాల

# వెలుఁగు

సమస్త జీవరాసులలో మానవుడు ప్రధానుఁడు. భగవద్భక్తి యుక్తుడగు వాడు శ్రేష్ఠుఁడు. కాని మానవునకు సుఖ వాంఛ, భోగలాలసత్వము అధికము. సంసారమునిత్యమనియు, నయనగోచర పదార్థజాలము నశ్వరమనియు, కర్మానుబంధముగ మరల జన్మముకల్గి దుఃఖపూరిత సంసృతీ నిమగ్నత తప్పదనియు నెంచి ఆధ్యాత్మిక చింతనా వివశత్వము పొందగల్గు టెంత మందికి లభించును. ఇందుకు పూర్వజన్మార్జిత పుణ్య ఫలము, వంశ పావనత్వమును తోడుపడవలెను. మఱియును తత్వజ్ఞానాసక్తిని పెంపొందిచు సంఘటనలైనను జరిగియుండవలెను.

ఈ మూడు గుణములును గల్గిన శ్రీ శ్రీశైలముగారు తనకుకల్గిన చింతనను పెద్దలనుండి గ్రహించియు, తత్వగ్రంథముల నధ్యయన మొనర్చియు "జన్మరాహిత్య ప్రబోధిని"యను గ్రంథమును ఘటించినారు. అయ్యది శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ పాదపద్మముల కంకితము గావించి ధన్యులయినారు. యదార్థ సంఘటనలను దాహరణములుగ పొందుపఱచి 'పునర్జన్మ' సిద్ధాంతమున కొంతి విశ్వాసమును రేకెత్తించినారు పునర్జన్మమునకు కారణము 'కర్మ'– కర్మాను సారియైన "జనన మరణ చక్రమును తప్పించుకొనుటకు మోక్షమే సాధనము"ని ప్రజలకు బోధించినారు. మోక్షమును ప్రసాదించు పరమాత్మను

చేరుకొనుటకు యోగ-జ్ఞాన మార్గములకన్న భక్తియే ప్రధాన మనియు, భక్తియందును మధురభక్తి ఉదాత్తమార్గమని యును తమ భావమును వెలయించి ప్రజలను మేల్కొలిపి నారు.

సంఘోపకారక గ్రంథము పఠితలను, గంధకర్తను అలరించును. ప్రజలలో పారమార్థిక భావమును నెలకొల్పు టకు; వేదాంత విషయముల లోనికి సాధకులను కొనిపోవుటకు వీరు సల్పిన ప్రయత్నము ప్రశంసార్హము. ఈ గ్రంథము పుష్ప గిరి పీఠాధిపతులచే ఆవిష్కరణ భాగ్యమును పొందినది. వారి ఆమోదముద్రను సంతరించుకొనినది. ఇట్టి గ్రంథమును సంఘ టించిన శ్రీ శ్రీశైలముగారి కుటుంబమును ఆవాసవీ కన్యకా దేవి దయతో బ్రోచుగాత !!!

ఓం తత్సత్

అష్టావధాని
శనగల సుందరరామయ్య
భాషాప్రవీణ

మాచర్ల
8–12–76

# కృతజ్ఞత

మహాశయులారా !

నేనల్పజ్ఞుడనే యైనను నాలో గల్గిన తీవ్రజిజ్ఞాసయు భక్త్యాసక్తులును నిట్టి గ్రంథమును నాచే వ్రాయించినవి. నేనీ రచనా కార్యక్రమమునకు పక్రమించుటకేర్పడిన కారణములను 'ఉపోద్ఘాతము'న విన్నవించియుంటిని.

నాయందలి దయతో నీ చిన్ని పుస్తకమును సమగ్రముగా పరిశీలించి, పరిష్కరించి మెరుగులు దిద్దిన 'విద్యావాచస్పతి' శ్రీ కొల్లిపర పాండురంగారావు, బి. ఏ. రాష్ట్రభాషా ప్రవీణగారికిని. ఈ పొత్తమును విశ్వశ్రేయస్కర కార్య నిర్వాహకములగు తమ పవిత్ర కరకములములతో నావిష్కరించి యాశీర్వదించిన, జగద్గురు భారతీస్వాముల వారికిని అత్యంత వాత్సల్యాభిమానములతో దమయాశీరభిప్రాయముల నందించిన మహనీయులు పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ కేశవతీర్థస్వామిగార్లకున్నూ, 'భాషాప్రవీణ' శ్రీశనగల సుందర రామయ్యగార్లకును కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలు లర్పించుచున్నాను,

ఈ గ్రంథ రచనకు ప్రేరకురాలగు నాకుమార్తె దివ్య శ్రీ జగజ్జనని: సీతాదేవి యంతిమ కోర్కెయగు 'శ్రీ వాసవీ మహాయజ్ఞము'ను వైభవోపేతముగ, సఫలీకృతముగ నిర్వహించుటకన్నివిధముల సహాకరించిన నాగార్జునసాగర్ పైలాన్ వైశ్యప్రముఖులకు నా హృదయపూర్వక ప్రణామసహస్రముల నందించుచున్నాను.

బుధజన విధేయుడు
కృతికర్త
పందిరి శ్రీశైలము

ఓం

శ్రీ వాసవీకన్యకాదేవ్యైనమః

# పునర్జన్మ

## 1. ప్రాణులకు పునర్జన్మ కలదా ?

హిందూ మతవిశ్వాసము ననుసరించి మానవునకు పునర్జన్మ కలదనుట ధ్రువమైన విషయము. ఈ విషయమును హిందూమతమునకు పరమ ప్రమాణములైన సర్వగ్రంథములు సంపూర్ణముగ సమర్థించుచున్నవి. నిర్భ్రాంతస్వతఃప్రమాణములగు వేదములలో పునర్జన్మను గూర్చి చెప్పబడిన విషయములను మచ్చునకు కొన్నింటిని యిట యిచ్చుచున్నాను. పరికింపుము.

మంత్రము : "అసునీతే పునరస్మాసు చక్షుఃపునఃప్రాణమిహానో దేహిభోగమ్.జ్యోక్ పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే మృడయానః స్వస్తి"

(ఋ—అష్ట ౮. అ. ౧. వ—౨౩. మం. ౧.)

ఈ పై మంత్రములో పూర్వోత్తరజన్మల విషయము ఇట్లు వర్ణింపబడినది. (అసునీతే) ప్రాణదాతవైన ఓ పరమేశ్వరా ! మేము మృతినొంది మరియొక శరీరమును ధరించి నపుడుకూడ మమ్ములను నిరంతరముసుఖవంతులుగా చేయుము. (పునరస్మాసుచక్షుః) పునర్జన్మలో మాకు ఉత్తమములయిన

నేత్రములు మున్నగు నింద్రియముల నొసంగుము. (పునః ప్రాణం) ప్రాణవాయువు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, బలము, పరాక్రమము మున్నగువానితో మా తనువులు కూడియుండునట్లు అనుగ్రహింపుము. (ఇహనో దేహి భోగమ్) ఓ పరమేశ్వరా! ఈ జన్మమునందును పరజన్మమునందును మేము ఉత్తమభోగములను పొందుదుముగాక. (జ్యోక్ పశ్యేమసూర్య ముచ్చరంతం) ఓ దేవా! నీ దయ వలన మేము సూర్యలోకమును శ్వాసప్రశ్వాసాత్మకమగు ప్రాణమును ప్రేమతో విజ్ఞానయుక్తులమై సదా చూతుముగాక. (అనుమతే మృడయానః స్వస్తి) ఓ యనుమాతీ! సర్వులకు మానము నొసంగుదేవా! సర్వజన్మములందును మాకు (మృడయా) సుఖములను చేర్చుము. అందువలన మాకు శుభము చేకూరుగాక. ఇదియే మా ప్రార్థన.

మంత్రము "పునర్ మైత్వింద్రియం పునరాత్మా ద్రవిణం బ్రాహ్మణం చ పునరగ్నయో ధిష్ణ్యా యథాస్థామ కల్పంతా మిహైవ."

(అథర్వ కం ౭ అను ౬. సూల ౭. మం ౧.)

(పునర్మైత్వింద్రియం) ఓ దేవా! నీ కృపవలన పునర్జన్మమునందు మనస్సు మున్నగు పదునొకండు ఇంద్రియములు నాకు మరల లభించుగాక. అనగా సంతతము మనుష్యశరీరము ప్రాప్తించునుగాక. (పునరాత్మా) ప్రాణధారణము చేయు సమ

ర్ధత నాకు లభించుగాక. అందుచే ఈ రెండవ జన్మమున ఆ జీవనపర్యంతము శుభాచరణము నొనర్చుచు బ్రతుకగలుగుదును. (ద్రవణం) సత్యవిద్యాది ఉత్తమ ధనముగూడ మాకు పునర్జన్మమున కలుగుగాక. (బ్రాహ్మణంచ) నిరంతరము వేదవ్యాఖ్యాన సహిత విజ్ఞానము దైవనిష్ఠయు మాకు లభ్యమగుగాక. (పునరగ్నయః) అటులే లోకోపకారమునకై అగ్నిహోత్రాది శుభకర్మల నాచరింతుముగాక. (ధిష్ణ్యాయథాస్థామ) ఓ జగదీశ్వరా ! మేము పూర్వజన్మమునందు సుబుద్ధియు, ఉత్తమ శరీరేంద్రియాదులను ఎట్లు కలిగియుంటిమో అట్లే పునర్జన్మము నందును సద్బుద్ధితో మానవశరీరములకు చెందిన కార్యముల నొనర్చుటలో సమర్థులమగుదుము గాక. ఇవి అన్నియు విశుద్ధమగుబుద్ధితో పాటుగా (మైతు) నాకు లభ్యమగుగాక. (ఇహైవ) వానిలో మేమీలోకమున పునః మానవజన్మనొంది చతుర్విధ పురుషార్థముల సాధింతుముగాక. ఆ భక్తివలన మాకు ఏజన్మమునందును దుఃఖము కలుగకుండుగాక.

మంత్రము . "ఆయోధర్మాణి ప్రథమః ససాదతతో వపూంషికృణుషేపురూణి. ధాస్యుర్ యోనిం ప్రథమ ఆవివేశో యోవాచమను దితాంచికేత".

(అథర్వ. వే. ౫ అ౧ సూ౧ మం ౨)

(ఆయోధర్మాణి) పూర్వజన్మమునందు ధర్మాచరణము గావించిన మనుష్యుడు (తతో వపూంషికృణుషే పురూణి)

ధర్మాచరణమునకు ఫలముగ అనేకములయిన ఉత్తమ శరీరముల ధరించును. అధర్మాచరణ మొనర్చిన మనుష్యుడు నీచములైన పశువాది శరీరములను పొందును. ఈ మంత్రము నందలి అర్ధభాగమున ఈ విషయమునే భగవానుడు తెలిపెను. (ధాస్యేర్ యోనిం) పూర్వజన్మమునచేసిన పాపపుణ్యాముల ఫలముల ననుభవించుచు జీవుడు పూర్వశరీరమును విడచి మొదట వాయువుతో నుండి తదుపరి జలము. ఓషధి, ప్రాణము మున్నగువానియందు ప్రవేశించి వీర్యమున జేరును. అటుపై యోని గర్భాశయమున స్థిరుడై మరల జన్మించును. (యోవాచ మనుదితాం ఆచికేత) వేదమునందు ఈశ్వరుడు ఆజ్ఞాపించినట్లు సత్యభాషణాదులు సరిగ చేయువాడై ధర్మమునందే (సనాద) దృఢముగనుండు నతడు పూర్వమువలెనే మనుష్య యోనియందు ఉత్తమ శరీరము ధరించి అనేక సుఖముల ననుభవించును. అట్లుగాక అధర్మము నాచరించువాడు పశుకీట పతఙ్గ్యాది నీచ శరీరములను పొంది పలు దుఃఖముల ననుభవించును.

వేదములందు పూర్వాపరజన్మంబులు జీవునకుగలవని వర్ణించినట్లే నిరుక్తకారుడుగూడ పునర్జన్మమును ప్రతిపాదించియున్నాడు.

సం॥ "స్వరస వాహీ విదు షోఽ పితథారూఢోఽ భినివేశః".

(పాతం. ప్తా. సూ౯)

(స్వరస) యోగదర్శనమును రచించిన పతంజలి మహా ర్షియు దానికి భాష్యకర్త యయిన వేదవ్యాసుడును పునర్జ న్మము ఉన్నదని ప్రతిపాదించిరి.

ఉపనిషత్తులయందు "అంతే మతస్సామతి" అనగా జీవి అంత్యకాలమందు ఏధ్యాసతో మరణించునో తీరుగా ఆజన్మనే ఎత్తవలయునని చెప్పబడియున్నది. అందువలన కూడా మరల జన్మ యున్నట్లేనని మనకు తెలియుచున్నది.

సర్వోపనిషత్ సారమగు భగవద్గీత యందలి "జ్ఞాన యోగమున" శ్రీకృష్ణార్జునులకు జరిగిన సంభాషణమును పరికిం పుడు.

శ్రీభగవానువాచ - శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహమనురిక్ష్వాకవేఽబ్రవీత్॥.

పార్థా! అవ్యయమయిన ఈ యోగమును మున్ను నేను సూర్యునకు ఉపదేశించితిని అతడు దీనిని వైవస్వత మనువునకు తెలిపెను. ఆమనువు ఇక్ష్వాకునకు దీనినుపదేశించెను.

అర్జున ఉవాచ · శ్లో॥ అపరంభవతో జన్మ పరంజన్మ వివస్వతః।
కథమేతద్విజానీయాంత్వమాదే ప్రోక్తవానితి॥

కృష్ణా! సూర్యుడు నీకన్న మున్నెన్నడో పుట్టినవాడు. నీవు ఇప్పుడు కలిగినవాడవు నీవీ యోగమును సూర్యునకు ఆదియందు ఎట్లు తెల్పితివి.

శ్రీభగవానువాచ - బహూని మే వ్యతీతాని జన్మానితవ చార్జున।
తాన్యహం వేదసర్వాణినత్వంవేత్థ పరంతప॥.

అర్జునా! నాకును నీకును అనేకజన్మములు గడచిపోయి నవి. వాని విషయమంతయు నేనెరుంగుదును. కాని నీవెరుంగవు.

ఈ పై సంభాషణమును గమనించినచో మానవునకు పూర్వాపరజన్మంబులు గలవనుట స్పష్టమగుచున్నది గదా! ఇట్లే న్యాయదర్శనమునందు మహా విద్వాంసుడగు గౌతమ మహర్షియు, న్యాయసూత్రములకు భాష్యము వ్రాసిన వాత్స్యాయనమునియు పునర్జన్మమును అంగీకరించినారు.

ప్రపంచమునగల ప్రాణులన్నంటికి పుట్టినదాది మరణ భయముండును. ఆ మరణభయము జీవునకు పూర్వాపరజన్మములున్నవని రూఢిపరచుచున్నది. గతజన్మములందు కలిగిన మృత్యుభయానుభవమును ఇప్పుడు స్మరించి ప్రతిప్రాణియు మరణభయము నొందుట చూచుచున్నాము. పూర్వజన్మమున ప్రాణి మృత్యుభయమును అనుభవింపకయున్నచో దానికి సంబంధించిన సంస్కారము ఆప్రాణి అంతఃకరణమున ఏర్పడదు. సంస్కారములేనిచో స్మరణము గలుగదు. అట్టియెడ భయము కలుగుటకు వీలుండదు. ఇప్పుడిప్పుడే పుట్టిన ప్రాణికూడ భయము అనుదానినే కలిగియుండుట సర్వవిదితము. అట్టి భయము పూర్వజన్మయందు అనుభవించి యుండకున్నచో

యిప్పుడు కలుగుటకు వీలులేదు. అందుచే జీవునకు పూర్వా పర జన్మములున్నవనక తప్పదు.

ఇది యిట్లుండ పునర్జన్మనుగూర్చి పలువురు విదేశీయులు చెప్పిన విషయములను పరికింపుడు.

ఆర్థర్ యి. మాశే : చెప్పిన విధమేమన మానవప్రపంచ మందు చాలమంది పునర్జన్మకలదని తెప్పకఒప్పుకొనుచున్నారు. మరియు ఈ నమ్మకము చరిత్ర పుట్టినదాది కలిగియున్నది. పునర్జన్మను సమర్థించుటకు అనేక తత్వశాస్త్రజ్ఞులు చెప్పు సూత్రములు గాక అవిపూర్తిగా రుజువు చేయగల ఏడుజనసమ్మతము లైనకారణములు గలవు.

1) అమరత్వము విషయమై ప్రాపంచికాభిప్రాయము నను సరించి నిజమై యుండవలెను.

2) పరిస్థితులనుబట్టి తప్పక అది నిజము కావలెను.

3) చాల విషయములందు విజ్ఞానశాస్త్రములో అనుగుణ్యముగనున్నది.

4) ఆత్మయొక్క స్వభావమును బట్టి అది అవసరము.

5) తత్వశాస్త్రసంబంధమైన మొదటి 'పాపము' 'ముందు శిక్ష' అను ప్రశ్నలకు పూర్తిగా జవాబు ఇవ్వగలదు.

6) విచిత్రమైన అనుభవములకు అసాధారణమైన జ్ఞాపకశక్తులకు అది సమాధానము చెప్పగలుగుచున్నది.

7) భౌతిక జీవనమందు శక్తి వహించినట్టి అన్యాయము మరియు బాధయొక్క సమస్యకు సమాధానము ఇదియే చెప్పగలదు.

క్రైస్తవుల బోధయగు 'ఏది నాటిన అదియే అనుభవమునకు వచ్చును' అనునది పురాతన బోధయగు పునర్జన్మ మరియు కర్మలకు సరిపోవును. గొప్పప్రతిభలను బాల్యమందలి అద్భుతశక్తులకు మరియు ప్రపంచమందలి గొప్ప తెలివి తేటలకు సరియైన సమాధానము కనిపించనందున పునర్జన్మమీదనే ఆధారపడవలసియున్నది. ప్రతివ్యక్తియు అనేకజన్మలు అనుభవించియుండును. అట్టి పూర్వానుభవమువల్ల వారుఇప్పుడు వివిధగుణములు గలిగినవారైయున్నారు.

డబ్లియు. ట్యూడర్ బోన్సు : ఈవిధముగా చెప్పిరి. మృత్యువు అనంతరము ప్రస్తుతమానవజీవనము ఇంకను జరుగుచుండుననియు దానిని త్రోసిరాజనుటకు వీలులేదనియు స్థిరపరచుటకు తత్వశాస్త్రము ముఖ్య ఆధారముగానున్నది. మనచావు అనగా ముందుజీవితమునకు మన పుట్టుకయే.

'గేతే' యీ విధముగా చెప్పిరి. మనకు కనబడుచున్న అంతము (చావు) నిజమైన అంతముకాదు. ఎందువలననగా అది ఆవ్యక్తి యొక్క నిజమైన సారమును అంటియుండదు. అదిచెడగొట్టునది తాత్కాలికముగా నుండురూపము మాత్రమే యని 'గేతే' చెప్పియున్నారు.

ఆత్మ అనునది సృష్టింపబడునది కాదు. అది శాశ్వతమైనది. మరియు మనుష్యరూపమునుండి జంతురూపములోనికి పోయి పోయి తిరిగి దానినుండి మనుష్యరూపములోనికి వచ్చునది అదియేనని ప్లేటో అభిప్రాయము.

2. పునర్జన్మ కలదని నిరూపించు ప్రత్యక్ష సాక్ష్యములేమైన కలవా ?

పునర్జన్మ కలదని నిరూపించుటకు మనదేశమునందేగాక విదేశములందుగూడ జరిగిన అనేక సంఘటనలు ప్రత్యక్షసాక్ష్యములుగానున్నవి. ఉదాహరణకై ఒకటిరెండు సంఘటనలను ఇచట పొందుపరచుచున్నాను.

అమృతబజార్ పత్రిక 1949 ఆగష్టునెలలో ప్రకటించిన అత్యద్భుతమైన పునర్జన్మ విషయమును పరికింపుడు. 1926వ సంవత్సరము అక్టోబరు 12వ తేదీన ఢిల్లీ నగరమున శాంతాదేవి యను నొక బాలిక జన్మించినది. ఆమెమాట్లాడుట నేర్చినది మొదలు తనపూర్వజన్మ విషయములను గూర్చియు, ఆజన్మయందు తనదినచర్యలను గూర్చియు, మూత్రాయను గ్రామములో తనభర్తయగు కేదార్‌నాద్‌జీతో తాను గడిపిన జీవితానుభవములను గూర్చియు తన గతజన్మము 1902 నుండి 1925 వరకు గడచినదనియు సమస్త విషయములను పూసగ్రుచ్చినట్లు చెప్పసాగినది. ఆబాలిక తలిదండ్రులు ఆమాటలను మొదట విశ్వసించలేదు. అవి పిచ్చిమాటలనిఎంచి పిల్ల

పెద్దదైన తరువాత ఆమె జ్ఞాపకశక్తినుండి అవియన్నియు అదృశ్యమగుననెడు నమ్మకములో నుండిరి. కాని అందుకు వ్యతిరేకముగా ఆమె పెరిగిన కొలది ఆమె గతజన్మపు జ్ఞాపకములుగూడ పెరుగసాగినవి. శాంతాదేవి తన పూర్వజన్మయందలి భర్తయొక్క చిరునామాను తల్లిదండ్రులకిచ్చి వానిని పిలిపింపుడని కోరెను. వారట్లే చేసిరి. అపుడు శాంతాదేవియొక్క పూర్వపుభర్తయైన కేదార్‌నాథ్ మూట్రా నుండి ఢిల్లీకి వచ్చెను. శాంతాదేవి కేదార్‌నాథ్‌ను చూచిన వెంటనే అతడు తన భర్తయని గుర్తుపట్టెను. చాల సమయమువరకు పాత పరిచయముల నొకరి కొకరి చెప్పుకొనిన పిదప ఆమె తన పూర్వపుభార్యయొక్క ఆత్మయని కేదార్‌నాథ్ ఒప్పుకొనెను. ఆ శాంతాదేవి చెప్పుచున్న విషయములలోని సత్యములను పరిశీలించుటకు విచక్షణాపరులు సమర్థులునగు పెద్దలతో ఒక కమిటి ఏర్పడెను. ఆమె అవరోధమువలన ఆ కమిటి వారున్నూ ఆమె తలిదండ్రులున్నూ ఆమెను మూట్రా కు తీసుకొనిపోయిరి. మూట్రా రైలుస్టేషను చేరిన వెంటనే ఆమె 'మూట్రా' 'మూట్రా' అని కేకవేసెను. ఆ బాలికను దేశబంధు గుప్త యను ఒక వ్యక్తి ఎత్తుకొని యుండెను. అట్లు పోవుచుండ త్రోవలో ఒక ముసలివానినిచూచి ఆ బాలిక గుప్తగారిచేతి నుండి క్రిందకుదూకి ఆ ముసలివాని కాళ్లకు ప్రణామముచేసి ఆయన తన పూర్వపు భర్తయొక్క అన్నగారగు బాబూరావు చేబిగారని చెప్పెను. ఆ విషయములు నిజమగుట వలన ప్రజ

లందరు చకితులై ఆమెను భయముతోను మర్యాదతోను చూడసాగిరి. స్టేషనునుండి తన భర్తయింటికి త్రోవ ఆమెయే చూపెను. అచట ఆమె తన గతజన్మలోని అనేక విషయాలను వివరించి అందరిని ఆశ్చర్యసాగరమున ముంచివేసెను. తరువాత ఆమెను ఆమె పూర్వపు తలిదండ్రుల యింటికి తీసుకొనివెళ్ళిరి. అటకు చేరుటతోడనే ఆమె తన తలిదండ్రులను గుర్తించి వారిని కౌగిలించుకొని ఏడ్వసాగెను. ఆమె యిష్టములేకున్నను ఆమెను వారివద్దనుండి బలవంతముగా తీసుకొనివచ్చిరి. ఈ విషయములు భారతీయ పత్రికలందేగాక విదేశీయ వార్తా పత్రికలందుగూడ ప్రచురించబడినది. ఇట్టి విషయములు హిందూదేశమునందు క్రొత్తవిగావు.

ఒక విదేశీయుడు తెల్పిన పూర్వజన్మానుభవమును పరికింపుడు. సోల్జర్ కాస్టర్ బర్మాదేశపు స్పీకరుగా నుండెను. అతని పేరు జార్జి కాస్టర్. అతడు 1935లో లండను సన్‌డే ఎక్స్‌ప్రెస్‌లో తన గతజన్మ జ్ఞాపకములనుగూర్చి యిట్లు తెలియపర్చెను. అతడు 1889వ సంవత్సరములో జన్మించి 1909వ సంవత్సరములో అనగా అతని 20వ ఏట బర్మాలో గల మేమెయో అను గ్రామమునకు పంపబడెను. ఆ దేశము తనకు పూర్వ పరిచయముగల దేశమనియు అందుతాను నివసించి యుందుననియు ఐర్రావతి నదినిగూడ ఎరుగుదుననియు మరియు ఆ నదికి ఆవలియొడ్డున ఒక పెద్ద దేవాలయముగల

దనియు దాని గోడకు పైనుండి క్రిందకు పెద్దపగులుండెననియు ఒక లాన్స్ కార్పొరల్ కాంగన్‌తో అతడు చెప్పగ అది విని అందరును ఆశ్చర్యపడిరి. ఈ విషయమై తలిఖీ చేయగ అతడు చెప్పిన విషయమంతయు పూర్తిగ నిజమయ్యెను. ఆతనికి గలిగిన యీ జ్ఞాపకములు ఆతని గత జన్మమునకు సంబంధించినవని సర్వులును అంగీకరించిరి. ఇట్టి పూర్వజన్మానుభవములను గూర్చి మనదేశమునందును విదేశములందును ఈ నడుమ వందల కొలది వ్యక్తులు విచిత్రములైన విషయములను తెలిపియున్నారు అవి అన్నియు 'IIustrated weekly' మున్నగు పత్రికలలో వరుసగా ప్రకటింపబడెను. ఈ గతజన్మ విషయములను పరిశోధించుటకు విదేశములలో నిప్పుడు ప్రత్యేక విశ్వవిద్యాలయములు నెలకొల్పబడినవి పూర్వాపర జన్మములు గలవనుటకు ఇంతకంటె ప్రత్యక్షసాక్ష్యములు ఇంకేమి కావలయును.

3. తనపూర్వజన్మ వృత్తాంతము ప్రతిమానవునకును ఏలజ్ఞప్తి యుండుటలేదు ?

మనపసితనమున గలిగిన విషయాలు మనకుజ్ఞప్తియందున్నవా ? లేవు. జ్ఞాపకము లేనంతమాత్రమున మనకు పసితనమే లేకుండెను అందుమా ! కొలదికాలము క్రితముజరిగిన చిన్ననాటి విషయములే జ్ఞప్తి యందుంచుకొనజాలని మనుష్యుడు గడచిన జన్మల విషయములను ఎట్లుజ్ఞాపకమునందు ఉంచుకొన

గలడు. మానవునకు పూర్వజన్మ జ్ఞానము లేకుండుటకు ప్రధాన కారణము మరియొకటి యున్నది. మనుజునకు తనపూర్వజన్మ స్థితిస్పష్టముగా తెలిసినయెడల అతని వర్తమాన జీవితము ప్రశాంతముగా గడచుట దుర్లభము. ఆతడు తన పూర్వజన్మ మున ఆచరించిన పాపములన్నియు జ్ఞాపకమునందు ఉన్నచో సంతతము వానిని గూర్చియే ఆలోచించుచు నిరంతరచింతతో నిద్రాహారములను లేనివాడై క్షీణించి పోగలడు. అందుచే కరుణామయుడైన పరమాత్మ మానవునకు గతజన్మల జ్ఞానము కలుగకుండునట్లు చేసినాడు. ఆత్మసంయమము, ఆత్మజ్ఞానము కలిగిన మహాత్ములైన బుద్ధుని వంటివారికి మాత్రమే పూర్వా పరజన్మల జ్ఞానము కలిగినది.

మరణించిన ప్రాణి ప్రేతయగుట కూడ పునర్జన్మను సూచించుచున్నది. "పునరుత్పత్తిః ప్రేత్యభావః" పూర్వశరీ రమును విడచిమరి యొక శరీరమును ధరించుటనే ప్రేత్యభావ మందురు. ప్రేత్య=మరణమును పొంది (చచ్చి) భావః మరల శరీరమును ధరించుట (జీవుడు మరల శరీరము గలవాడగుట.)

4. మరణించిన పిదప తిరిగిజన్మించుటకు సరిగాఎంతకాలము పట్టును ?

ఈవిషయమై కాల నిర్ణయమును తెల్పుట అత్యంతకష్ట సాధ్యము. ఏలననగా ప్రతివ్యక్తి చేయుకర్మయొక్క స్వభావము మరణకాలమున ఆవ్యక్తి చేయు ఆలోచనలు మున్నగు కారణ

ములచేత మరణించిన వానికి పునర్జన్మ కలుగుటకు కొన్నిదిన ములు కొన్ని నెలలు కొన్ని సంవత్సరములు లేక కొన్ని వందల సంవత్సరములుకూడపట్టవచ్చును. కొన్నిప్రాణులు వాని కర్మ ఫలములను ఇతర సూక్ష్మభూమికలలో అనుభవించుచుండుటచే క్రొత్తశరీరమును పొందుటకు చాలకాలముపట్టును. దివ్యము లైన కొన్నిఆత్మలు మరల శరీరమును ధరించుటకు బహు కాలము పట్టును. ఏలననగా భూలోకమున ఒకసంవత్సరకాలము దివ్యభూమికలలో ఒక దినముతో సమానము. సూక్ష్మ భూమి కలలో కర్మఫలముల ననుభవించు వారు సూక్ష్మశరీరముతో వానిననుభవింతురని పెద్దలవాక్కు.

5. సూక్ష్మ శరీరమనగానేమి ?

సూక్ష్మశరీరమనగా గాలిబంతిలోనుండు రబ్బరుబ్లాడరు వలె స్థూలదేహములోపల నుండునది. ఇదిస్థూలశరీరముయొక్క సరియైన ప్రతిరూపము.

6. ప్రతివాడును మానవజన్మనే మరల మరల కోరుకొనుటకు గలకారణమేమిటి ?

ఈ సృష్టిలో మానవుడు సర్వశ్రేష్ఠుడైనప్రాణి. మాన వుడు బుద్ధిజీవి. అతడు హృదయము, బుద్ధి, శరీరముల అద్భుత సమ్మిశ్రణస్వరూపుడు. హృదయముద్వార అనుభూతిని పొంద గలడు. బుద్ధిచే ఆలోచించగలడు. శరీరేంద్రియములద్వార ఆ ఆలోచనలకు రూపము నివ్వగలవాడు ఇట్టిశక్తి మానవేతర ప్రాణులలోలేదు. కనుక భూమియందు మానవ జీవితము

అత్యంత ఆకర్షణ కలదై యున్నది. అతడు గతజన్మలలో అనుభవించిన సుఖానుభూతుల వాసనలు కలిగియుండుటచేతనే మరల మరల మనుష్య జన్మమే కావలయునని కోరుకొనుచుండును.

7) భూలోకమునగల ప్రతిజీవియు నిట్లు మరణించుచు మరల పుట్టుచు నున్నది కదా! ఏకారణము లేక యే ప్రాణులు పుట్టుట చచ్చుట జరుగుచున్నదా? లేదా చావు పుట్టుకలకు కారణమేమైన కలదా?

చావుపుట్టుకలు ఒక ప్రత్యేకమైన చట్టము ననుసరించి జరుగుచున్నవి. ఆ చట్టమునకు అన్నిచట్టముల లోబడినవియే. ప్రతికార్యమునకు కారణము ఉండియే తీరవలయును. కావున మానవుల చావు పుట్టుకలు నిష్కారణముగ కలుగుట లేదు. మానవులాచరించు కర్మల ఫలితములే వానిచావు పుట్టుకలకు జీవిత విధానములకు వారి సుఖదుఃఖములకు ప్రధాన కారణములు. దీనినే కర్మసిద్ధాంతము లేక కర్మచట్టము అనుచున్నారు. పూర్వాపరజన్మల కార్యకారణచట్టమిదే.

—o—

# కర్మ

**8. కర్మలనగా నేమి? అవి జన్మలకెట్లు కారణమగు చున్నవి? వాని ఫలితములు మానవులు ఎట్లు అనుభవించుచున్నారు?**

జీవితమున మానవుడు ఆచరించు పనులన్నియు కర్మలు అనబడును. ప్రత్యక్షముగాగాని పరోక్షముగాగాని లోక హితము కొరకు కావించు కర్మలన్నియు సత్కర్మలు. లోక హితమునకు హానిచేకూర్చు కర్మలన్నియు దుష్కర్మలు. మానవుడు ఈ కర్మలకు స్వయంకర్త స్వయంభోక్త అయి యున్నాడు. ఆ కర్మల ఫలితముల ననుసరించియే మనుష్యునకు హానివృద్ధులు సుఖదుఃఖములు లాభనష్టములు ఆరోగ్య భాగ్యములు పునర్జన్మములు లభించుచుండును. దైవము ఆ కర్మలకు సాక్షియై యుండి ఆయాకర్మల ఫలములను మానవులు అనుభవించునట్లు విధించుచుండునేగాని మానవుని కర్మాచరణమును మార్చుట మాన్పుట మున్నగు ఎట్టి కార్యములు చేయదు. కావుననే దైవలక్షణములనుగూర్చి "ఉదాసీనవదాసీనః" అని శాస్త్రములు పల్కినవి. భగవత్ ప్రసాదితమైన బుద్ధి జ్ఞానము మానవునకు లభించి యుండుటచేత మనుష్యుడు తానాచరింపదగు కర్మల నిర్ణయించుకొనుటకు జీవితమును ఉత్తమముగా తీర్చి దిద్దుకొనుటకు సమర్థుడైయున్నాడు. ఆతడు తన యీ సామర్థ్యమును సద్వినియోగము చేసుకొనక దుష్టకార్యముల నాచరించినచో దుష్ఫలితమును అనుభవించక

తప్పదు. మానవుడు ఆచరించు మంచిని పుణ్యమనియు, చెడును పాపమనియు వ్యవహరించుచున్నాము.

9. ఒక్కొక్క సందర్భమున మంచిదిగా పరిగణింపబడిన పని మరియొక సందర్భమున చెడుగా రూపొందుచుండుట లోకమున కలదుగదా? పాపపుణ్యములు పనినిబట్టి ఏర్పడునా లేక ఎట్లేర్పడును?

పాపపుణ్యములు మానవుడాచరించు పనులనుబట్టి కలుగవు. ఆ పనులు చేయుటకు కారణములైన సంకల్పములను బట్టి కలుగుచుండును. బంగారుగాజులతో నిండియున్న ఒక స్త్రీ హస్తమును ఒక దొంగవాడు ఆ గాజులు హరించు సంకల్పముతో ఖండించుచున్నాడు. వ్యాధిగ్రస్తమైన హస్తముగల ఒక స్త్రీయొక్క శేషాంగశ్రేణిని రక్షించు సందర్భములో ఒక వైద్యుడు రోగముచే చెడిన ఆ హస్తమును శస్త్రచికిత్స విధానమున ఖండించుచున్నాడు. దొంగవాడును వైద్యుడును స్త్రీహస్తమును ఖండించుట అను పనినే చేయుచున్నారు. ఇరువురు చేయుపని ఒక్కటియే అయినను సత్ సంకల్పముతో ఉపకారబుద్ధితో చేతిని ఖండించు వైద్యునకు పుణ్యమును దుస్సంకల్పముతో అపకారబుద్ధితో హస్తమును ఖండించు దొంగకు పాపమును సంక్రమించుచున్నవి. కావున పాపపుణ్యములు పనులను బట్టియుండక ఆ పనులు జరుగుటకు కారణములైన సంకల్పములను బట్టి యుండును. ఇటులే లోకమందలి

సర్వకార్యములకు పాపపుణ్యములు సంక్రమించును. ఈ కార్యముల ఫలాఫలముల ననుసరించియే జన్మములులభించుచుండును. మానవుని యీ కర్మలను శాస్త్రములు మూడు విధములుగా విభజించి చెప్పినవి. 1) ఆగామి కర్మ. 2) సంచిత కర్మ, 3) ప్రారబ్ధ కర్మ.

**10. ఆగామి కర్మ యనగానేమి ?**

మానవుడు ఒక జన్మమున ఆచరించు కర్మ ఫలితముల ననుసరించి మరుజన్మము కలుగునని తెలిసినదికదా ! అట్లు మరుజన్మమున శుభాశుభములను కల్గించు కార్యములు ఆగామి కర్మలనబడును. ఈ జన్మమున మనము ఆచరించు ఏ పనులైతే మరుజన్మమునకు కారణభూతము లగుచున్నవో అవి ఆగామి కర్మలనబడును.

**11. సంచిత కర్మ యనగానేమి ?**

పూర్వజన్మములలో మనము ఆచరించి నిలువచేసికున్న కర్మల ఫలము సంచిత కర్మమనబడును. ఇందు సత్కర్మల ఫలితము దుష్కర్మల ఫలితము రెండును నుండును.

**12. ప్రారబ్ధ కర్మ యనగా నేమి ?**

పూర్వజన్మములలో సముపార్జించుకొని యున్న సంచిత కర్మమునుండి యీ జన్మమున మనము అనుభవించుటకుగాను విధిచే నిర్ణయింపబడి యొసగబడు కర్మఫలమే ప్రారబ్ధము అనబడును. ఇట్లు ప్రారబ్ధముగ లభించు పుణ్యపాప కర్మల ఫలము

లను ప్రతిమానవుడును అనుభవింపకతప్పదు. ఈ ప్రారబ్ధకర్మ ననుభవించుటకే మానవుడు యీజన్మమును పొందియున్నాడు. ఈ విధిని దాటుటకు ఎవ్వరును సమర్థులుకారు. బ్రహ్మాదులకు గూడ యీవిధి అవశ్యభోక్తవ్యము. మానవుడు యీ జన్మ మున అనుభవించు సుఖము, దుఃఖము, సంపద, దారిద్ర్యము, ఆరోగ్యము, అనారోగ్యము, కీర్తి, అపకీర్తి, లాభనష్టములు మున్నగు సర్వవిషయములును ఆతని ప్రారబ్ధము ననుసరించియే నిర్ణయింపబడినది. ఈ ప్రారబ్ధ కర్మఫలములు మానవునకు ముందుగనే తెలియకుండగనే అప్రయత్నముగ లభించు చుండును. మానవునకు ప్రపంచమున సర్వమూ అనగ జీవిత మున అతనికి లభించు ప్రతి విషయము ఆతని ప్రయత్నము వలన కార్యములవలన కలుగును. ఆ ప్రయత్నములకు కార్య ములకు మూలము ఆతనిబుద్ధి. మానవుడు తనకు పుట్టుబుద్ధిని బట్టి పనిచేసి శుభాశుభ ఫలము లనుభవించుచున్నాడు. ఏ పని యైనను చేయవలయునను బుద్ధిపుట్టినప్పుడే మానవుడు చేయును. అన్నము తినవలయునను బుద్ధి పుట్టినపుడు తినును. నిద్రించ వలయునని బుద్ధి పుట్టినపుడు నిద్రించును. కూర్చొనవలయు ననెడు బుద్ధి కలిగినపుడు కూర్చొనును. నిలువ వలయుననెడు బుద్ధి కలిగినపుడు నిలచును. ఇట్లు మానవుడు చరించు ప్రతి పనియు జరుగుటకు ఆతని బుద్ధి కారణమగుచున్నది. బుద్ధి ఆతని ప్రారబ్ధకర్మము ననుసరించియే కలుగుచుండును. కనుకనే "బుద్ధిః కర్మానుసారిణీ" అని గీతాచార్యుడు

నుడివినాడు. అందుచే మానవుడు సుఖములు అనుభవించుట కేవలము అతని తెలివితేటలవలన జరుగునని లేక కష్టము లనుభవించుట అతని తెలివితక్కువ చేతనని భావించుట తగదు మానవునకు పిన్నవయసులోనె మాతృవియోగదుఃఖము, పితృ వియోగదుఃఖము, అటులనే తల్లి తండ్రులకు గర్భశోకము; కొందరు పిల్లలు గర్భములోనె చనిపోవుట, కొందరు ఆకస్మిక మరణములు నొందుట, కొంతమంది అర్ధాయుష్కులై మరణించుట మరికొందరు నూరేళ్ళకు మించిన కాలమువరకు బ్రతుకుట కొందరు వికలాంగులుగా పుట్టుట, పుట్టిన తదుపరి కొందరు వికలాంగులగుట కొందరు అందలము లెక్కుట కొందరు అన్నముకొరకై అలమటించుట కొందరు ఘోరవ్యాధులచే బాధపడుట, కొందరు మిక్కిలి ఆరోగ్యవంతులు, బలవంతులగుట, కొంతమందికి అకస్మాత్తుగా లాటరీవంటి వాటిలో ధనము లభించుట, కొంతమందికి వున్న సంపదలన్నియు వూడిపోవుట మున్నగు సకల విషయములకు గతజన్మల కార్యములే కారణములు. ఇట్టివానియందు మానవుని ప్రయత్నముతో ప్రమేయము లేకుండా లభించు శుభాశుభములకును అట్టికార్యములు ఆచరించు బలీయమైన బుద్ధికిని ప్రారబ్ధకర్మయే ప్రధాన కారణమని తెలియనగును.

12. మానవుని జీవితమున జరుగు సమస్తమునకు గతజన్మల కర్మఫలితమే కారణమైయుండి అది అనివార్యముగ అనుభ

వింపవలసి యున్నప్పుడు ఎట్టి పుణ్యకార్యములచేతను ప్రారబ్దము నశింపని పక్షమున భగవత్‌భక్తివలనను పుణ్యకార్యాచరణముల వలనను గలుగు ప్రయోజనమేమి?

ఎంతవారికిని ప్రారబ్ధమును అనుభవించుట తప్పదు అనుట ప్రత్యక్షర సత్యము. ఈ విషయాలను స్పష్టముగా తెల్పుచు శ్రీ శివానంద సరస్వతి మహరాజ్‌వారు చెప్పిన యితిహాసమును పరికింపుడు. పూర్వము పండరినాథ్ అను ఒకభక్తుడు కలడు. అతడు నిరంతరము దైవసేవ గావించుచు జీవించుచుండెను. ఆతనికి ఒకతల్లి తప్ప నా యనువారెవ్వరును లేకుండిరి. ఆ తల్లి కూడ మరణించెను. అపుడు ఆ భక్తునకు మాతృవియోగ దుఃఖము కలుగలేదు. ఓ దేవా! నాకుగల ఒక్క బంధనమునుగూడ నేటితో త్రెంచివేసి నీసేవ నిరంతరాయముగ కొనసాగించు అవకాశమును కల్పించితివి అని, భగవంతుని స్తోత్రముచేసి మిక్కిలి సంతోషించెను. అటుపై అహోరాత్రములు పరమాత్మ సేవయందే మునిగియుండి అన్నపానీయములను కూడ మరచిపోయెను. అచట జనార్దనస్వామి దేవాలయము ఒకటి కలదు. అందున్న స్వాములవారు ఆభక్తుని స్థితిని గమనించి తన అర్ధాంగియైన లక్ష్మితో దేవీ! "అనన్యాశ్చింతయంతో మాం యేజనాహపర్యుపాసతే। తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహం." అని భక్తు

లకు మాటయిచ్చి యుంటినిగదా! ఆమాట ననుసరించి యీ భక్తుని యోగక్షేమములను పరికించుట మన కర్తవ్యమై యున్నది. కావున నీవు యీబంగరు పళ్లెరమున పంచభక్ష్య పరమాన్నములనుంచి ఆ భక్తునకు అందించిరమ్మని చెప్పెను. అంత నాలక్ష్మీదేవి భోజ్య పదార్థములను తీసుకొనిపోయి ధ్యాననిమగ్నుడై యున్న పండరినాథ్ వద్ద ఉంచి అదృశ్య మయ్యెను. పండరినాథుడు కనులుతెరచి కోరకనే లభించిన ఆ ఆహారమును భుజించి మరల దైవధ్యానమున మునిగి పోయెను. అట దేవాలయములో బంగరు పాత్రలు కనుపింపక అర్చకులు ఆందోళనపడి వానికై వెదకుచు కనులు మూసుకొని నిద్రించుచున్న మునివలెనున్న పండరినాథ్ చెంత ఆ పాత్రలుండుట గమనించి ఆ భక్తునే దొంగగా భావించి పట్టి బంధించి రాజసముఖమునకు నీడ్చుకొని పోయిరి. రాజు ఆ భక్తుని అత్యంత కఠినముగ కొరడాలతో కొట్టించి శిక్షించెను. నాటిరాత్రి రాజునకు జనార్దనస్వామి స్వప్నమున దర్శన మిచ్చెను. స్వామి శరీరమున వాతలుతేలి రక్తమయమై యుండెను. వెంటనే రాజు నిద్రనుండి మేల్కొని శ్రీజనార్దన స్వామివారి దేవాలయమునకు వెళ్ళి చూడగా స్వామివారి విగ్రహమునుండి రక్తము కారుచుండెను. ఆ వింత దృశ్యము సర్వులను ఆశ్చర్యపరచినది. పండరినాథ్ శరీరముపై పడిన కొరడా దెబ్బల వాతలు స్వామివారి విగ్రహముపై కనుపించు టను చూచి రాజు తన తప్పును తెలిసికొని భక్తాగ్రగణ్యుడగు

పండరినాథ్‌ను అచటకు పిలిపించెను. స్వామివారి శరీరము నుండి స్రవించుచున్న రక్తమునుచూచి ఆ భక్తుడు దీనాతి దీనముగా ఏడ్వసాగెను. అంత స్వామివారి శరీరమునుండి రక్తము స్రవించుట ఆగిపోయెను. పండరినాథ్ వ్యాకులపడుచు పరంధామునిచూచి ఓ భక్తరక్షకా! నిరపరాధినగు నన్ను రాజదండమునకు గురిచేసితివి. నాకు ఇవ్వబడిన శిక్షను నీవు అనుభవించితివి. అట్లుకాక రాజదండనమునే ఆపి యుండిన ఈ బాధ కలిగి యుండెడిది కాదుగదా! అని ప్రశ్నింప స్వామివారు ప్రత్యక్షమై యిట్లనిరి. భక్తా! ప్రారబ్ధమును అనుభవింపవలసినదే. నీ ప్రారబ్ధము ననుసరించి నీకు యీ రాజదండన లభించవలసి యున్నదికాని నీవు ఆత్మజ్ఞానము కలిగియున్నవాడవై భక్తి యోగమును సాధించి నాకు సర్వసమర్పణము చేసుకొన్నవాడవగుటచే నీకు సంక్రమింపవలసిన సర్వఫలములును నాకు చెందినవైనవి. అందుచే ఆ బాధకూడ నాకే అందినది. నా భక్తాగ్రగణ్యులైన ప్రహ్లాదుడు, మున్నగువారి జీవితములు ఈ సత్యమును ప్రకటించుచున్నవిగదా! కావున ఏ మానవుడు నా చింతనము గలిగి జ్ఞానయుక్తుడై తన సర్వస్వమును నాకర్పించునో ఎవ్వడు ఈ ప్రపంచమున నిస్సంగత్వమును సాధించి తాను నిమిత్తమాత్రుడై నేనొసగిన బాధ్యతలను నిర్వర్తించునో అట్టివానికి కర్మఫలములు అంటవు. ఆతనికి ప్రారబ్ధ ఫలముంటదు. అట్టియెడ కర్తయు, కార్యమును, భోక్తయు నేనే యగుదును. అర్జునునకు భగవద్గీతద్వార ప్రబోధించిన పరమార్థ

మిదియేనని పల్కి ఆ పండరినాథునకు ముక్తినొసంగెను. ఈ చరిత్రను పరికించినచో మానవుడు దైవభక్తి గలిగి యుండవలయునని విశదమగును. దైవార్పణ బుద్ధితో సమస్తమును నిర్వహించు వానికి కర్మఫలములు అంటకుండుటయేగాక ఆతడు కలిగి యుండిన సంచితకర్మ శేషమునను సరించి మరియొక జన్మము కలిగినను ఈ జన్మమున ఆతడు ఆచరించు సత్కార్యముల ఫలమే ఆగామి కర్మగా రూపొంది వానికి గలుగు మరుసటి జన్మము ఉత్తమమైనదిగను, ముక్తిదాయకమైనదిగాను, రూపొందును. కావున ప్రతిమానవుడు తప్పక సదాచారపరుడై దైవచింతనారతుడై జ్ఞానముక్తుడై భక్తుడై జీవింపవలసియున్నది.

సామాన్య మానవునకు నిస్సంగత్వమును సాధించిన జ్ఞానయోగికి ప్రారబ్ధము ననుసరించి వ్యాధియో, క్షతియో, ప్రమాదమో కలుగుట తప్పక జరుగును. కాని శరీరమును మనస్సును వేరుగా నుంచగల సాధకుడు తనకు గలిగిన బాధను అనుభవించుచున్నట్లు కనిపించు చుండునేగాని ఆ బాధ వలన అతనికి కష్టము గలుగదు. ఉదాహరణకు ఒక మనిషి తన మనస్సును ఒకానొక విషయమునందు పూర్తిగ సంలగ్నమొనర్చి అతివేగముగా పోవుచున్నాడనుకొనుము. మార్గమున అతనికి ఆకస్మికముగా ఒక ఎదురుదెబ్బ తగిలి వ్రేలుచిట్లి రక్తము స్రవించును. కాని అతడు అన్యాభావయుక్తచిత్తుడై యుండుటచేత దానిని గమనింపడు. తరువాత కొంత సమయ

మునకు ఆతని దృష్టి ఆకాలి వ్రేలిపై బడి ఆతని మనస్సు దాని నైపునకు మరలినపుడే వానికి ఆ బాధ తెలియును. ఇది సర్వసాధారణముగా జరుగు విషయము. వానికి దెబ్బతగిలినపుడు వాని మనస్సు శరీరమునంటి యుండక అన్యవిషయమున సంలగ్నమై శరీరమునకు వేరై యుండుటచేతనే యిది సంభవించినది. కావున శరీరమును మనస్సును వేరుపరచి యుంచగల జ్ఞానయోగులకు సాధకులకు ప్రారబ్ధవశమున సంభవించిన వ్యాధులు మున్నగు కష్టములు వారి శరీరమునకు అంటియుండి బాధించుచున్నట్లు కన్పించుచున్నను నిజమునకు వారు ఆ బాధ నొందరు. వారు ప్రారబ్ధమును ఈ విధముగ అనుభవింతురు. అట్టివారు సుఖము పొందిన పొంగరు, దుఃఖముగలిగిన విచారించరు. వారు సుఖదుఃఖములకు అతీతులై యుందురు. కావున ఆధ్యాత్మిక పరిజ్ఞానముచే మానవుడు ప్రారబ్ధమును అవలీలగా అనుభవించగలడు అని తెలియుచున్నదిగదా!

**14. ఒక శరీరమును విడిచిన జీవి (మరణించినవాడు) మరల ఏ విధమున మరియొక శరీరమును ధరించుచున్నాడు (పునర్జన్మమును పొందుచున్నాడు?)**

జీవి ఒక జన్మమున తనకై నిర్ణయించబడిన కర్మానుభవమును పొందిన తరువాత మరణించును. పంచభూతాత్మకమైన ఆతని దేహము పంచభూతములలో విలీనమగును. అటుపై ఆ జీవుడు శేషకర్మానుభవముకొరకు వర్షాది రూపమునవచ్చి ఆహారరూపమున స్త్రీ పురుషులయొక్క గర్భాశయములను జేరి

అన్నసారభూతమగు శుక్లశోణితముల రూపమును ధరించును. పురుషరేతస్సు ఋతుకాలమునందు భార్యయందు ప్రవేశపెట్టబడి శోణితముతో కలసి జీవాశ్రయమగు మరియొక శరీరము ఉత్పత్తియగుటకు హేతువగుచున్నది. శిశుజన్మమునకు పూర్వమును జననకాలమందును అటు తర్వాతను గూడ శిశువును తలిదండ్రులు కాపాడుచున్నారు. ఈ శిశువులే ముందు సంతతి అవిచ్ఛిన్నముగా సాగుటకు కారణమగుచున్నారు. ఇదియే జీవులజన్మ విధానము.

15) మానవుడు ఎల్లప్పుడు గతజన్మల కర్మలఫలముల ననుభవించుచు చచ్చుచు పుట్టుచు నుండవలసినదేనా ? లేక ఈ జనన మరణ చక్రమునుండి మానవుడు తప్పించుకొనుటకు వీలున్నదా ?

మానవుడు నిరంతర సాధనచే మోక్షమును పొందుట ద్వార యీ జనన మరణ చక్రమునుండి తప్పించుకొనవచ్చును.

— o —

# మోక్షము

16) మోక్షమనగా నేమి ?

మోక్షమనగా విడుదల, ఎందుండి యీ విడుదల అనినపుడు బంధమునుండి అని జవాబు వచ్చును. బంధమనగా అస్వతంత్రత. అస్వతంత్రునకు భయము, దుఃఖములుండును. ఈ భయదుఃఖములు కలిగించినది జగత్తు. ఈ జగత్తునకు కారణము అజ్ఞానము. కావున యీ జగత్తు సత్యమని యెంచుటయే అజ్ఞానము. ఆ భ్రమవలననే బంధము కలుగును. ఆ బంధము నశించినపుడే మానవుడు ముక్తుడు, స్వతంత్రుడు కాగలడు. బంధమునకు హేతువు అజ్ఞానమని తెలిసినదిగదా ! బంధము నశించవలయునన్న ఆ అజ్ఞానము నశింపవలయును. అజ్ఞానమువలన అహంకారము జనించును. అహంకారమువలన సంకల్పము కలుగును. సంకల్పమే కర్మకు కారణము. కర్మములవలన సుఖము, దుఃఖము మున్నగు అనుభవములు కలుగుచున్నవి. ఆ అనుభవములు వాసనారూపములుగా హృదయమునకు హత్తుకొని నిలుచుచున్నవి. ఆ వాసనలు మరుజన్మమునందును స్మృతిని గల్గించుచున్నవి. స్మృతి పురుషుని తిరిగి కార్యోన్ముఖునిగా చేయుచున్నది. కావున యీ సంకల్పమే (కోరికయే) బంధమునకు మూలకారణ మగుచున్నది. సంకల్పమునకు ఆధారము మనస్సు. మనస్సు త్రిగుణాత్మకము. ఈ మనస్సే అజ్ఞానమునకుగూడ ప్రతిరూపమగుచున్నది. కావున

మనస్సు నశించినచో సంకల్పములు అజ్ఞానము వాటియంతట అవియే నశించును. యథార్థమగు ఆత్మజ్ఞానమువలన అజ్ఞానము (మిథ్యాజ్ఞానము లేక అవిద్య) నశించును. అపుడు జీవునియందు గల రాగద్వేషములనెడి దోషములు నష్టమగును. అటుపై ప్రవృత్తి, అధర్మము, అన్యాయము, విషయాసక్తి మున్నగు వాసనలు దూరమగును. ప్రవృత్తి లేనప్పుడు దానివలన కలిగెడి జన్మకూడ తొలగిపోవును. జన్మము లేనందున సర్వదుఃఖములు సంపూర్ణముగా లేకుండపోవును. ఇట్లు జీవునియందు విజ్ఞానము, శుద్ధియు కలిగి జీవునకు స్వరూపప్రతిష్ఠ కలుగును. శుద్ధస్వరూపుడగు పరమేశ్వరునకును జీవునకును అపుడు వ్యత్యాసము ఉండదు. కావున ఆ జీవుడు పరమాత్మతో కలసినిత్యానందమయుడగును. ఆ స్థితిని కైవల్యము, మోక్షమందురు. కావున మానవుడు జగత్తు మిథ్యయని తెలిసికొని సమస్తములైన కోర్కెలను సంకల్పములను నశింపజేసికొని తన సత్యస్వరూప స్వభావములను జ్ఞానమువలన నెరిగి శుద్ధాత్మ స్వరూపుడై పరమాత్మునియందు గలియుటయే మోక్షమని తెలియుచున్నది. ఇట్లు మోక్షమునందుటయే జనన మరణ చక్రము నుండి విడివడుటకు మార్గము. ఒక్కమాటలో చెప్పవలయునన్నచో మానవుడు ఈప్రపంచమునందు తనకున్న అస్తిత్వభావమును సంపూర్ణముగా నశింపజేసికొని దైవముతో కూడుటయే మోక్షము. కావున మానవుని జననమరణ చక్రమునుండి తప్పించి ఆతనికి ముక్తిని ప్రసాదింపగలిగినది దైవము.

# దైవము

17) దైవమనగా నేమి ?

అనంతము అచింత్యము అనిర్వాచనీయమునగు దైవ తత్వమును మాటలతో తెల్పుట అసాధ్యము. దైవము కేవలము అనుభవైకవేద్యము. అయినను ఆవశ్యకత ననుసరించి ఆ తత్వమును గూర్చి అత్యంత సంక్షిప్తముగా వివరింప ప్రయత్నము చేయుచున్నాను. ప్రాజ్ఞులు ఇందలి పరమార్థమును గ్రహింపగలరని నమ్ముచున్నాను. సర్వజగత్ సృష్టి, స్థితి, లయములకు మూలకారణమైనది దైవము. ఆ దైవమును గూర్చి మహామహులైన కొందరు ప్రకటించిన అభిప్రాయములను ముందు గమనింపుడు.

సృష్టి స్థితిలయముల కాధారమై యెట్టి పరిణామమును చెందని చైతన్యశక్తియే దైవము. మృత్యు మధ్యమున యమరత్వము, అంధకారమున అంతర్జ్యోతి, అనంతదుఃఖ మధ్యమున అనంతానుభవమే దైవము. [మహాత్మాగాంధీ]

(1) ఒకటి దేవుడు. (0) సున్న జీవుడు. సున్నకు విలువ సంఖ్య యున్నప్పుడే సముద్రము అలలకాధారమైనటుల ఈ సుగుణ ప్రపంచమునకు మన కాధారమైన అనంత చిదాకాశమే దేవుడు. [రామకృష్ణ పరమహంస]

ప్రతి జీవియందును అనంత దైవశక్తి యున్నది. తన పురుష ప్రయత్నమువలన తన్ను తానుద్ధరించుకొను పురుష ప్రయత్నమే దైవము. [స్వామి వివేకానంద]

అన్నింటిలోను దేవుని దర్శించుట, విశ్వమంతయు దేవుని స్వరూపమనియు, అదియే తన స్వరూపమనియు తెలిసి కొనుట దైవము. [స్వామి రామతీర్థ]

తాను - విశ్వము - దైవము వేరుకాదని తన్ను తా నెరుగుటయే దైవము. [రమణ మహర్షి]

కులమును చూచుట అజ్ఞానదృష్టి; గుణమును చూచుట జ్ఞానదృష్టి; విశ్వమంతయు భగవంతునిగా జూచుట విజ్ఞానదృష్టి ఆ దృష్టియే దైవము. [మళయాళ స్వామీజీ]

ఈశ్వరుడు, బ్రహ్మ, పరమాత్మ మున్నగు నామములు గలవాడు, సచ్చిదానందాది లక్షణయుక్తుడు, సర్వవ్యాపకుడు, అజన్మానంతుడు, సర్వశక్తిమంతుడు, దయాళువు, న్యాయకారి, సకల సృష్టికర్త, ధర్త, హర్త, కర్మానుసారముగ సత్యన్యాయములతో జీవులకు ఫలప్రదాత, మొదలగు లక్షణయుక్తుడు పరమేశ్వరుడని నమ్ముచున్నాను.

[మహర్షి స్వామి దయానంద సరస్వతి]

పైన ఒసగబడిన అభిప్రాయములన్నిటిని పరికించిన మీదట దైవమనునది సచ్చిదానందాది లక్షణయుక్తుడై

అనంతజ్ఞానరాశియై ఆదిమధ్యాంత రహితమై సకల చరాచర సృష్టి, స్థితి, లయకారకమై నిర్గుణమై సగుణమై జీవులకు కర్మ ఫల ప్రదాయకమై యుండు విశుద్ధ మహాచైతన్యమని సంక్షిప్తముగ తెలియనగును. అయిన ఈ దైవము పురుషుడా స్త్రీయా, లేక నపుంసకత్వమా అను ప్రశ్న ఉదయించును. వేదాది సత్యగ్రంథములందు దైవము స్త్రీ, పుం,నపుంసకములగు మూడు లింగముల నామములతో తెలుపబడినది. "బ్రహ్మచితి రేశ్వరశ్చేతి" దేవశబ్దము బ్రహ్మ శబ్దమునకు పర్యాయశబ్దమైనచో దైవము అనియు, ఈశ్వరశబ్దమునకు పర్యాయపదమైనచో దేవుడు అనియు, చితిశబ్దమునకు పర్యాయపదమైనచో దేవి అనియు వ్యవహరింపబడినది. అంతేకాని దైవము పురుష రూపముగాదు, స్త్రీరూపముగాదు, షండరూపముగాదు. అది సకలము నిష్కళంకము సగుణము నిర్గుణము. దైవము విశ్వమయము. విశ్వోత్తీర్ణము.

**18. దైవము నిర్గుణముగా, సగుణముగా, రెండు విధములుగా ఎట్లగుచున్నది ?**

ఈ విషయమును తెలిసికొనుటకు ముందు సృష్టి విషయమును గూడ ఒకింత తెలిసికొనవలయును. సృష్ట్యాదిస్థితిని గురించి వేదములందున్న విషయములను గమనింపుడు.

మంత్రము :

"తమ, ఆసీ త్తమ సాగూఢమగ్రే। ప్రకేతం సవిలం।సర్వమాఇదమ్।
తుచ్ఛేనాభ్యపిహితం యదాసీ త్తప స్తన్మహినాజాయతైకమ్ ॥
(ఋగ్వేద మం౧౦; సూ ౧౨౯, మం. 3)

తా॥ [ ఈసృష్టి అంతయు, జగత్తునకు పూర్వము అంధకారముచే నావృతమై, రాత్రిరూపమున, తెలియుటకయోగ్యమై, మరియు ఆకాశరూపమున తుచ్ఛమై, అనంత మహాచ్చైతన్యము నందొకచో నాచ్ఛాదితమై యుండెను. పిమ్మట సంకల్పసిద్ధమైన ఆ చైతన్యముచేత కారణరూపము నుండి కార్యరూపమున ప్రకటమయ్యెను.]

పై విషయమును పరికించినచో, సృష్టికి పూర్వము దైవమగు మహాచ్చైతన్యము నిర్గుణముగ, నిరాకారముగ, సర్వ వ్యాపకముగ నుండినట్లు తెలియనగును. అట్లు నివృత్తి ముఖముగనున్న మహాచ్చైతన్యమే సచ్చిదానంద పరబ్రహ్మ మన బడినది. సృష్టి జరిగినపుడు ఆ సచ్చిదానంద పరబ్రహ్మమే ప్రవృత్తి ముఖముగనుండి నామరూపమయమగు ప్రకృతి యందు గోచరించుచు పరాప్రకృతియని పిలువబడుచున్నది. నానారూప మయమగు సృష్టి ఏదియైనను, అది అంతయు పరా ప్రకృతి విలాసము. నామరూప జగమందలి చేతన విలాస మంతయు పరబ్రహ్మ స్వభావము. పరాప్రకృతియు పరబ్రహ్మము ఒక్కటియే. కావున ఈ అఖండ విశ్వమంతయు పరమాత్మ

యొక్క మహావిలాసమే. ఈ జగత్తంతయును అనంతశక్తుల విజృంభణము.

దైవమగు ఈ పరబ్రహ్మము రెండువిధములుగా భాసించుచున్నది. ఒకటి నిర్గుణపరబ్రహ్మము. రెండు సగుణ పరబ్రహ్మము.

నిర్గుణపరబ్రహ్మము స్థావర జంగమాత్మకమగు సర్వ జగత్తునకాత్మ. అదియే దైవసాక్షాత్కార కారణము. అదియే దైవము. ఆ పరబ్రహ్మమే జీవుని మాయనుండి తొలగించి విముక్తుని జేయును. పరమాత్మ విశ్వరూపియేగాని విశ్వమే పరమాత్మ రూపముగాదు. పరమాత్మ విశ్వోత్తీర్ణమైనది. విశ్వముసే పూర్తిగా ఎరుగజాలని మానవుని విజ్ఞానము. విశ్వోత్తీర్ణమైన పరమాత్మకు రూపమును నిర్ణయించుట అసాధ్యము. పరమాత్మ పరంజ్యోతి స్వరూపము. సూర్యునిలోనున్న వరేణ్య తేజమును ఉపాసింతుమని గాయత్రీ పరమార్థము. సూర్యునిలోనున్న ఆ తేజము బాహిరమై ప్రపంచవస్తువుల భాసింపజేయు కార్యతేజము కాదు. సూర్యుడుకూడ ప్రకాశించుటకు హేతువైన మహాతేజస్సు. "తస్యభాసా సర్వమిదం విభాతి" అని శ్రుతి బోధించుచున్న మహాతేజమే యీ తేజము. కావున పరమాత్మ తేజస్సునకు తేజస్సు, చక్షునకు చక్షువు, మనస్సునకు మనస్సు, అది మహాజ్యోతి. దాని కాంతిలేశము కలిగి సూర్యాదులు ప్రకాశింతురు. పరమాత్మ నిత్యము అభి

వ్యాప్తము. అన్నియు దానియందున్నవి. అన్నిటియందు అది యున్నది. అన్ని రూపములు దానియందున్నవి. అన్నిరూపములయందు అదియున్నది. వ్యావహారిక సర్వభేదములును కారణమునందు విలీనమగునపుడు సర్వజగత్కారణమగు పరమాత్మ నిర్గుణ రూపమున అవస్థితమగును. అట ఎట్టిభేదములును భాసింపవు.

నిర్గుణ పరమాత్మ సగుణ రూపముగా రూపొందినపుడు స్పష్టరూపమున అన్నియు గోచరములగును.

దృశ్యరూపమగు సమస్తవిశ్వము పరమాత్మయొక్క సగుణ శక్తి కార్యము. ఈ సగుణశక్తి సత్వరజోతమోగుణముల సామ్యావస్తురూపము. ఈ త్రిగుణ కార్యములు సుఖ దుఃఖ మోహములు. విశ్వపదార్థములన్నియు యీ మూడుగుణములు కలిగియుండును. సగుణపరమాత్మ విశ్వమున కార్య రూపమున నున్నది. కావున కార్యరూపమే పరమాత్మ రూపముగా భావింపవలయును. అంతేగాని సర్వచరాచర జగత్తునకు ఆత్మయు కారణమునగు పరమాత్మను నేత్రములతో గ్రహించుటకు నియమితమైన రూపము నిర్ణయింపబడజాలదు. కావున అనేక కార్యముల రూపమునయున్న సగుణపరమాత్మయొక్క కర్మల గుణస్వభావముల ననుసరించి ఆ పరమాత్మకు అనేక నామములు రూపములు ఏర్పడినవి. పురుష రూపమున యీ సగుణపరబ్రహ్మను భావించినపుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు

గాను, స్త్రీ రూపమున భావించినపుడు, మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళీ స్వరూపులుగా సంభావిత మగుచుండును. ఇట్లనేక రూపములు అనేక నామములు దైవమునకు ఏర్పడుచున్నవి. వీరికి ఆకారములు ఆయుధములు, ఆభరణములు, ఆవాసములు, వాహనములు మున్నగు లక్షణములన్నియు ఏర్పడుచున్నవి. ఈ ఆకార ప్రకారములలో పరమాత్మయొక్క ఆయా కార్యముల తత్త్వ రహస్యము ఇమిడియుండును. ప్రాజ్ఞులు ఆ రహస్యమును ఎరిగి అనేకత్వమునందున్న ఏకత్వమును దర్శింతురు. ఇట్లు పరమాత్మ సగుణ నిర్గుణ రూపముల ప్రవర్తిల్లుచున్నది.

**19. అట్టి పరమాత్మను పొందుటకు మార్గమేమి ?**

పరమాత్మను పొందుటకు అనేక మార్గములున్నవి. వానిలో కర్మ, యోగము. భక్తి, జ్ఞానము అను నాల్గును ప్రధానమార్గములని పెద్దలు సూచించిరి.

--౦--

# యోగ మార్గములు

**20.** కర్మ అనగా నేమి ?

కర్మను గురించి వేదములలో చెప్పబడియున్నది. వేదములను మూడు భాగములుగా విభజించిరి. మొదటిది 'కర్మకాండ'. ఈకాండ యజ్ఞయాగాది రూపమైన వేదములందు తెలుపబడిన యజ్ఞ కర్మలు మాత్రమేకాక మానవుడు తన జీవితమునందు ఆచరించు ప్రతిపనియు కర్మమనియే యనబడును. మనుజుడు స్వార్థబుద్ధితో తనకొరకై చేయుపనులు ఆతనిని బంధించి ఆతని ఉత్తర జన్మమునకు కారణములగుచున్నవి. అటుగాక ఆతడు దైవార్పణ బుద్ధితో లోకహితార్థమై పనులు ఆచరించినచో ఆకర్మలు వానిని బంధించవు. వాని వలన అతనికి మరుజన్మము కలుగదు. లోకహితార్థమై చేయబడు ప్రతి పనియు యజ్ఞమగుననియు కావున మనుజుడు ఫలాపేక్షరహితముగ భగవదర్పణ బుద్ధితో సర్వకార్యములు చేయుచుండ వలయుననియు యిట్లు నిష్కామముగా కర్మల నాచరించుటయే కర్మయోగ మనబడుననియు శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతయందు తెలిపియున్నారు.

'కర్మ' యోగములలో ప్రధానమైనది. ఇట్టి కర్మయోగము వలన మానవునకు చిత్తశుద్ధి గలిగి, బుద్ధి ప్రాపంచిక విషయములలో మునిగిపోక, యీ సంకుచిత విషయ దృష్టి

నుండి బయల్పడి నిష్కలుషమైన భక్తిమార్గము లోనికి పోవును. ఇది సర్వమానవులకు ఆచరణయోగ్యముగా సులభముగా నుండును. ఫలాపేక్షను వదలిచేయు ఈ నిష్కామ కర్మయోగమువలన మోక్షమును పొందవచ్చును. ఇట్టి కర్మయోగమే జన్మరాహిత్య స్థితిని బోధించుచున్నది.

**21. యోగమనగా నేమి ?**

యోగమనగా కలయిక లేక కూడిక. ఆత్మ పరమాత్మల కలయికనే యోగమందురు. పూర్వకాలమున పతంజలి మహర్షి యిట్టి కలయికను తెల్పు 'యోగసూత్ర' మను ఒక గ్రంథమును వ్రాసియున్నారు. యోగమునకు ఉపయుక్తములైన భక్తి, జ్ఞానవైరాగ్యములకు సాధనములైన లక్షణములన్నిటిని క్రోడీకరించి ఎనిమిది సోపానములుగా చెప్పియున్నారు. దీనినే అష్టాంగ యోగమని అందుము.

**22. అష్టాంగ యోగమనగా నేమి ?**

అష్టాంగయోగమనగా 1) యమము 2) నియమము 3) ఆసనము 4) ప్రాణాయామము 5) ప్రత్యాహారము 6) ధ్యానము 7) ధారణము 8) సమాధి అను ఎనిమిది లక్షణముల కలయిక. వీనిని వివరముగా చెప్పవలయుననిన ఒక్కొక్కదానిని గూర్చి ఒక్కొక్క గ్రంథమగును. కనుక సంక్షిప్తముగా తెల్పుటకు ప్రయత్నింతును. ఇందులో మొదటిదైన 'యమము'ను గూర్చి తెలిసికొందము.

'యమము' అనగా ఈ ఆధ్యాత్మ విద్యకు ప్రాణము వంటిది. ఆధ్యాత్మిక గ్రంథములన్నిటికిని ముఖ్యమైన పునాది వంటిది. దీనియందు ఐదు అంతర్భాగములు ఉన్నవి. వీనిని త్రికరణ (మనోవాక్కాయ) శుద్ధిగా అనుష్ఠింపవలయును. మనము ఏపనినైనను చేయవలయుననిన ముందుగా ఆలోచింతుము. ఇట్టి ఆలోచన రూపమైన కర్మనే మానసికకర్మ అనియు అందుము. ఆలోచించి దానిని మరియొకరితో సలహాకో, న్యాయముకొరకో చెప్పుదుము. ఇట్టి దానిని వాచికకర్మ యనియు అందుము ఇట్లు ఆలోచించిన దానిని శరీరముతో చేయుదుము. ఇట్టి దానిని కాయికకర్మయని అందుము. ఏ మంచిపనినైనను మనము త్రికరణ శుద్ధిగా చేయవలయును. మంచి విషయములైతే వృద్ధి పొందవలయును.

'యమము' నందు అయిదు అంతర్భాగములు ఉన్నవని మొదటలో చెప్పుకొనియుంటిమి. అవి 1) అహింస 2) సత్యము 3) అస్తేయము 4) బ్రహ్మచర్యము 5) అపరిగ్రహము.

'అహింస' అనగా ఏ జీవికైనను మనోవాక్కాయములచే కష్టము కలిగింపకుండ నుండుటయేయనియు, తనయొక్క నిజస్వరూపము తెలిసికొనుటయే యనియు పెద్దలు నుడివియున్నారు.

'సత్యము' అనగా వేదములందు, కర్మకాండములందు విధి వాక్యములందు మిక్కిలి ముఖ్యమై యున్నది. ఈ పదమే సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మము అని వచ్చుచున్నది. అబద్ధము చెప్పకుండుటయే దీని అర్థము. ఆడినమాట తప్పకుండుటనే సత్యమని యందుము. దీనిని సాధింపవలయునన్న ఎంతత్యాగము నైనను చేయవలసియున్నది.

అస్తేయము అనగా దొంగతనము చేయకుండుట. దీనిని సాధింపవలయునన్న పూర్తిగా తృష్ణ నశించి పోవలయును. ఆనందమును అనుభవింపవలయునన్నచో ప్రపంచ విషయములలో తృప్తి యుండవలయును. అపుడు మనకు ఏచోరత్వ దోషమును అంటదు. దీనినే అస్తేయమని యందుము.

మానవ జీవితమును నాల్గు ఆశ్రమములుగా నుండునట్లు పెద్దలు విభజించిరి. అందు మొదటిది బ్రహ్మచర్యాశ్రమము. మనుష్యుని జీవిత సాఫల్యమంతయు నీ ఆశ్రమముపై ఆధార పడియుండును. ఉపనయన సంస్కారము కలిగిన తదుపరి విద్యాభ్యాసమునకై అనగా ఆధ్యాత్మికజ్ఞానమును పొందుటకై మానవుడు ఈ ఆశ్రమమున ప్రవేశించును. బ్రహ్మచారికి ముఖ్యముగా శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానములను ఆరులక్షణము లుండవలయును. అట్టి బ్రహ్మచారికి పరబ్రహ్మమును పొందు ఆధ్యాత్మిక పరిజ్ఞానము సులభ సాధ్యమగును. బ్రహ్మచర్యము కేవలము అవివాహితునికే

గాక, గృహస్తునకుగూడ ఆచరింపదగినది. బ్రహ్మచర్య వ్రతమును ఆచరించువాడు మాత్రమే బ్రహ్మమును పొందుటకు తగిన శక్తి బలము పటుత్వములను పొందగలడు. ఈ బ్రహ్మచర్యమునే సాధనసంపత్తి యనవచ్చును. సామాన్యార్థమున బ్రహ్మచర్యమనగా కామినీ కాంచనములకు దూరముగా నుండుట. ఇదిఆధ్యాత్మికాభివృద్ధికి మూలాధారము.

**23)** నియమము అనగానేమి ?

యమమునకువలెనె నియమమునకును ఐదు అంతర్భాగములున్నవి. అవి 1) శౌచము 2) సంతోషము 3) తపస్సు 4) స్వాధ్యాయనము 5) ఈశ్వరప్రణిధానము.

**24)** శౌచము అనగానేమి ?

శౌచము అనగా పరిశుభ్రత. శుచి అనియు దీనినందురు. అంతఃశౌచము, దేహశౌచము, వస్త్రశౌచము, గృహశౌచము, పరిసరశౌచము అనబడు పలువిధములైన శౌచములను మనము క్షుణ్ణముగా పాటించునప్పుడే సాధన సక్రమముగా మనకు సాగిపోవును. కావున శౌచము సాధనకు ఎంతయో ఉపకారి యగుచున్నది.

**25)** సంతోష మనగానేమి ?

సంతోషమనగా సుఖము. ఎప్పుడు విషయసుఖములలో మునిగియుండుట యేనా ? యను ప్రశ్న ఉదయించును. సంతోషము అదికాదు. మనము అనుకొనుచున్న సుఖము సంతోష

ములవలె సున్నితమైనటువంటిదికాదు. ఇందులో మార్గవము ఉన్నది. సుఖము అనగా ఈ లోకసంబంధ విషయముల వలన కలుగు ఆనందమువంటి తృప్తి. ఈ తృప్తిని పొంద కున్నచో దుఃఖము అందుము. ఇట్టి సుఖదుఃఖములు ప్రపంచ విషయములపై ఆధారపడి యుండును. ఈ సుఖదుఃఖములకు అతీతమై అన్యముగనుండు స్థితియే నిజమైన సంతోషము. ఈ సంతోషమును అనుభవించువానికి శరీరము మంచి తేజస్సు గలిగియుండును. ముఖములో కాంతి వెలుగుచుండును. నేత్ర ములు కళకళలాడుచు ఒక మెరుపును కలిగియుండును. దీనిని మానసికముగా పొందినచో సత్వబుద్ధి పెంపొందును. శాంతము తాండవించును. మాటలు మృదు మధురత్వమును కలిగి యుండును. దీనివలన కామక్రోధాదులు సడలిపోవును. ఎల్ల ప్పుడు మందహాసముతో నుండుట దీనియొక్క ప్రధాన లక్ష ణము. పెద్ద వెకిలినవ్వు పనికిరాదు. ఇంగ్లీషులో సామెతఒకటి యున్నది. "A loud laugh denotes a vacant mind" పెద్ద నవ్వు ఖాళీచిత్తమును సూచించును— అని దీనిభావము. ఈ సంతోష విషయము సులభముగా అందరికిని తెలియునదై యుండుటచే ఇది అత్యంత ముఖ్యమైనది.

**26) తపస్సు అనగానేమి ?**

తపస్సు అనగా అనేక నిర్వచనములు పెద్దలు చెప్పి యున్నారు. తీవ్రముగా గ్రంథమును చదువుట, ధ్యానము

చేయుట, జపముచేయుట, నియమయుక్తముగా జీవనము చేయుట, బ్రహ్మచర్యము మొదలగు విషయములన్నింటిని తపస్సు అనియే అందురు. అంతేగాక బుద్ధిని ఏకాగ్రతతో ఒకచోట నిలిపి చేయు ఏపనినైనను తపస్సు అనియే చెప్ప నగును. ఇట్టిది కామ్యముచేత చేసినను, నిష్కామ్యముగా చేసినను తపస్సే యగును తపస్సు అను లక్షణమే లేకపోయి నచో ఆధ్యాత్మిక విషయములన్నియు కుంటుపడిపోవును. ఈ తపస్సు ఏ ఫలితమునైనను ఇచ్చుటకు కామధేనువు వంటిది.

27) స్వాధ్యాయము అనగానేమి ?

స్వాధ్యాయము అనగా వేదాధ్యయనము. వేదములను చదువవలయునన్నచో పైనచెప్పబడిన తపస్సు ఉండవల యును. వేదాధ్యయనమువలన భగవద్భక్తి మిక్కుటముగా కలుగును. క్రియాయోగమున చివరరాబోవు ఈశ్వర ప్రణి ధానమునకు ఉపయోగించు ఏ క్రియనైనను స్వాధ్యాయము అనియే యనవచ్చును. కావున భక్తిని కలిగించు పుణ్యచరిత్ర ములు మున్నగు వాని పఠనము కూడ స్వాధ్యాయమనబడు చున్నది.

28. ఈశ్వర ప్రణిదాన మనగానేమి ?

ఈశ్వరుడు సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, అనంత జ్ఞానరూపుడు, ఆదిమధ్యాంత రహితుడు, సృష్టిస్థితిలయ కారకు డని ఆ దైవముయొక్క లక్షణములను గ్రహించినచో ఆ దైవ

ముపై మనకు భక్తి కలుగును. ఇట్లు భగవంతుని గొప్పదన మును గ్రహించి ఆతనియందు మన చిత్తమును లగ్నము చేయుటకై భక్తితో చేయు ప్రయత్నమే ఈశ్వర ప్రణిధాన మనబడు చున్నది.

## 29. ఆసనమనగా నేమి ?

దేహమున నొప్పి తిమ్మిరి మున్నగు ఎట్టి బాధలును కలుగకుండ ఎక్కువకాలము కూర్చొనగలిగిన పద్ధతిని ఆసనము అందురు. అందువలననే పతంజలిమహర్షి యీ ఆసనముయొక్క నిర్వచన మిచ్చుచు "స్థిరసుఖమితి ఆసనం" అని, అనినారు. మనము సుఖముగ ధ్యానము చేసికొనుటకు ఉపయుక్తముగా కూర్చొను ఏ విధానమైనను అది ధ్యానాసనమని అనబడును. ఈ ఆసనములకు వెన్నెముక మిక్కిలి ముఖ్యము. వెన్నెముకను నిటారుగా నుంచవలయును. కాని ప్రయత్నపూర్వకముగ దీనిని బిగించి నిలిపినచో బాధకలుగును. కనుక బిగించి నిలుపుట పనికిరాదు. నడుమును ఏమాత్రము నడ్డిగా నుంచినను కొంచెము సేపులోనె నొప్పి ప్రారంభమగును. కావున మెడను వెన్నెము కను బిగింపు లేక సులువుగా నిలువుగా నుంచుట ఆసనములందు ప్రధానము ప్రథమమునైన సూత్రము. ఇక కాళ్లుపెట్టుట యందు అనేక మార్పులు కలుగును. ఈ మార్పులననుసరించి ఆసనములకు అనేక నామములు కలుగుచున్నవి. శీర్షాసనము, పద్మాసనము, మయూరాసనము మున్నగు ఎన్నియో ఆసన

ములున్నవి. వానియందు పద్మాసన శీర్షాసనాదులు మిక్కిలి ముఖ్యములైనవి.

### 30. ప్రాణాయామము అనగానేమి ?

వ్యక్తి ఆసనశుద్ధిగా కూర్చొని కుడిచేతితో ముక్కును పట్టుకొని బొటనవ్రేలిని కుడిముక్కుమీద ఉంగరపువ్రేలిని ఎడమముక్కుమీదను నుంచవలయును. తదుపరి బొటనవ్రేలితో కుడి ముక్కును నొక్కియుంచి ఎడమ ముక్కుద్వార గాలిని పూర్తిగా పీల్చవలయును. పీల్చిన గాలిని కొంచెముసేపు ఊపిరితిత్తులలో నుంచవలయును. అట్లు గాలిని నిలిపి యుంచునపుడు ఎడమముక్కును గూడ వుంగరము వ్రేలితో నొక్కి మూయవలయును. పీల్చిన గాలిని గొంతుపైకి రానివ్వకూడదు. తరువాత కుడి ముక్కును మెల్లగా వదులుచేయుచు చాలనెమ్మదిగా గాలిని బయటకు వదలివేయవలయును. ఇట్లు గాలిని పీల్చుటను పూరకమనియు పీల్చిన గాలిని లోపల నిలుపుటను కుంభకమనియు తిరిగి ఆ గాలిని వదలివేయుటను రేచకము అని యందురు. పూరక కుంభక రేచకములను యీ మూడింటిని కలిపి ఒక ప్రాణాయామము అని యందురు. ఈ ప్రాణాయామ మొనర్చు సమయమున కొంచమైనను శ్రమ యుండరాదు. ఇట్లు సాధ్యమైనంత ఎక్కువ కాలము ప్రాణాయామము లొనర్చుటకు సాధన చేయవలయును. ప్రాణాయామము వలన రక్తశుద్ధియు, నాడీశుద్ధియు కలిగి ధ్యాననిమగ్నతకు ఎక్కువ

అవకాశ మేర్పడును. దేహమున తేజస్సు కలుగును. కంఠ స్వరము మృదువగును. నేత్రదృష్టి బాగుగనుండును. జ్ఞాపక శక్తి పెరుగునుకాని యీ ప్రాణాయామము నభ్యసించు చున్నంతకాలము వ్యక్తి బ్రహ్మచర్యమును యమ నియమము లను తప్పక పాటింపవలయును. ఈ ప్రాణాయామముచే అష్ట సిద్ధులు అనేక మహత్తులు సంకల్పసిద్ధులు పూర్తిగ కలుగును. ఇది మిక్కిలి జాగరూకతతో అనుభవజ్ఞుల మార్గదర్శనముతో చేయవగినదిగాని పుస్తకములందు చదివి దీని నభ్యసింప ప్రయత్నించినచో కొంత ప్రమాదముకూడ కలుగవచ్చును.

## 31. ప్రత్యాహారము అనగానేమి ?

ఆధ్యాత్మికాభివృద్ధికి యమ నియమముల ద్వార మన బాహ్య ప్రవర్తమును పవిత్రము చేసికొనిన పిదప ఆధ్యాత్మి కానుభవరాసిని పొందుటకు ధ్యానమునకు ముందువచ్చు ఆలోచ నలను అరికట్టుట యను ప్రక్రియనే ప్రత్యాహారమనియందురు. ఇది ఎటులన పొలములో విత్తనములు చల్లబోవుముందు పొల ములో గల కలుపు మొక్కలను తీసిపారవేసి, ఆ క్షేత్రమును శుభ్రముచేసి, ఏ ఆటంకములును లేకుండ యితరమైనటువంటి భావములను తీసివేసి యుంచుటనే ప్రత్యాహారము అని యందురు. దీనినిగూర్చి అరవిందులు ఒక చక్కని ఉపమాన ములో వివరించియున్నారు. పరికింపుడు ! ఒక చెరువునకుఅలలు వచ్చుచుండును. ఈ అలల కెరటములు గాలి వీచుచున్నందు

వలన వచ్చుచుండును. మన చిత్తముకూడ ఈ చెరువువంటిదే. భావములు కెరటములవంటివి. ప్రపంచములో గల విషయ వాంఛలు అనగా లౌకిక సుఖములు వానిని గూర్చిన అపేక్షలే గాలి యనుకొనుము. చెరువునకు గాలి లేకున్నచో అలలును కెరటములును లేకుండ ఆ చెరువు నిర్మలముగా ప్రశాంతముగా నుండును. ఆ విధముననే మన చిత్తములో లౌకిక సుఖములకు తావివ్వనియెడల మనస్సు ప్రశాంతముగ నుండును. మనస్సులో ఈ లౌకిక సుఖములకు తావివ్వకుండుటయే ప్రత్యాహారమని యందుము. ఇది ఎంతకష్టమో ఆలోచింపుడు ! చెరువుమీదికి గాలిని రాకుండ చేయుట ఎంతకష్టమో మనస్సులోనికి ప్రపంచ విషయములను ఈ లౌకిక భావములను రానివ్వకుండుటఅంత కష్టము. ఇట్టి కష్టసాధ్యమైన ప్రత్యాహారమును జయించిన యెడల ఆధ్యాత్మికానుభవరాసిని చూడగలుగుదుము.

32. ధ్యానమనగా నేమి ?

ధ్యానమునకు పునాది ప్రత్యాహారము. ప్రత్యాహారము తెలియకపోయినచో ధ్యానమే లేదు. ఇట్టి ప్రత్యాహారములకు యమ నియమములు ముఖ్యమైనవి. అభ్యాస వైరాగ్యములచే ప్రత్యాహారము పొందినచో ధ్యానము కుదురును. ఇట్టిధ్యానము కోసము ఎంతయో కష్టపడవలయును. త్యాగము చేయవల యును. ఇది ఆధ్యాత్మికానుభూతిని గలిగించును. ఈ అను భూతి జన్మజన్మలకు మనవెంట వచ్చుచున్నది. ఇదియే జన్మ

రాహిత్యమును ప్రసాదించి ఆనందసాగరమున ముంచివేయును. మన నేత్రములకు కనిపించు అమిత ఆకర్షణీయములైన యీ ప్రపంచ సుఖములన్నింటిని త్యజింపవలయును. అపుడే మనకు ధ్యానము కుదురును. పొలములో కలుపు తీసిన తదుపరి సాగు చేయబడిన చేనులో విత్తనములను వేయుటనే ధ్యేయము అని యందుము. అటులనే ధ్యానములోనుండు ధ్యేయవస్తువు పరమాత్మ.

33. పరమాత్మను ఎట్లు ధ్యానింపవలయును ?

పరమాత్మను ధ్యానింపవలయునన్న ఉపనిషత్తులనుండి పరమాత్మయొక్క విషయములను తెలిసికొనవలయును. వీనిని విమర్శనాదృష్టితో పరికించినపుడు పరమాత్మ శబ్ద స్పర్శరూప రసగంధములేని నిర్గుణ నిరాకార తత్త్వమని తెలియును. అట్టి పరమాత్మను ధ్యానించుట ఎట్లు సాధ్యమని మనస్సు సంకోచించును. ఆ పరమాత్మ పురాణములందు పురుషుడుగా నున్నట్లు చెప్పబడియున్నది. పురాణ పురుషుడుగా నుండు ఆ ఈశ్వరుని మరల మూడు భాగములు గావించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులని పేర్లుపెట్టిరి. వీరినుండి ముప్పదిమూడు కోట్ల దేవతలు ఏర్పడియున్నారు. వీరికి రూపములు, నామములు, వాహనములు నివాసములు ఏర్పడియున్నవి. కాని అసంఖ్యాకులైన యీ దేవతలలో ఎవరిమీద ధ్యానమునిలుపవలయునను ప్రశ్న యుదయించును. ఒకవ్యక్తి తన యిష్టము

ననుసరించి ఏదియో ఒక దేవతను తన ధ్యానమునకు ధ్యేయముగా ఎన్నుకొనును. వాని యిష్టము వాని సంస్కారముపై ఆధారపడి యుండును తమోగుణము ప్రధానముగ నుండు సాధకుడు కాళికాదేవి, పోలేరమ్మ, అంకాలమ్మ మున్నగు దేవతలను ధ్యేయవస్తువుగా చేసికొనును. అటుగాక సాధకుడు రజోగుణ ప్రధానుడయినచో వానికి వీరభద్రస్వామి, ఉగ్రనరసింహస్వామి, మున్నగు దేవతలు ధ్యేయ వస్తువులగుదురు. సత్వగుణ ప్రధానుడగు సాధకునకు సత్వగుణమూర్తులగు రాముడు, కృష్ణుడు, అన్నపూర్ణ, శ్రీ వాసవికన్యకాపరమేశ్వరి మొదలగువారు ధ్యేయవస్తువు లగుదురు.

సత్వగుణమూర్తులైన దేవతలను ధ్యేయములుగా పెట్టుకొనుటయే ఉత్తమమైనది. మనము ఎక్కువగా ప్రేమించు దేవత రూపమును ధ్యానసమయమున మన దృష్టిలో నుంచుకొనుటయే రూపధ్యానమనబడును. ఆ దేవతయొక్క నామమును మొదట బిగ్గరగా ఉచ్చరించుచు తరువాత నెమ్మదిగా పలుకుచు అటుపై మనస్సులోనే నిలుపుటను నామధ్యానమనియందురు. అటులనే భగవానుని గుణములను, మహత్తరకార్యములను స్తుతించుట, ప్రార్థించుట, మనస్సులో నిలుపుకొనుటయే భావధ్యాన మనబడును. ఈ విధముగ భావనామరూపధ్యానములను ప్రత్యాహారముచే పరిశుభ్రము గావింపబడిన నిర్మల మానసముతో చేయుటయే ధ్యానము అని తెలియ నగును.

**34. ధారణము అనగానేమి ?**

ధ్యానమాధుర్యమును చవిజూచి ప్రయత్న పూర్వకముగ శ్రమించి తన యిష్టదేవతామూర్తిని ధ్యానమునకన్న హెచ్చుగా తనదృష్టిలో నిలుపుకొనుటనే ధారణము అని యందుము.

ధారణమునకన్న ఏడురెట్లు హెచ్చుకాలము మనస్సున తన యిష్టదేవతామూర్తిని నిలుపుకొనినచో దానిని సమాధి యని యందుము. కన్నుమూసినను కన్ను తెరచినను తనయిష్ట దైవమే గోచరించు స్థితియే సమాధి స్థితియని తెలియవలయును. ఈ సమాధులలో అనేక రకములున్నవి. ధ్యానము నందుండు దైవముయొక్క రూపముమీదనే బుద్ధి నిలచినచో అట్టి సమాధిని "భావ" సమాధి యందురు. అటుగాక గుణము మీదనే బుద్ధిని నిలిపినచో దానిని సవికల్ప సమాధి యందురు. ఈ రెండువిధములుగా నామరూప గుణములను దాటి కేవల ఆనందమున మునిగినచో దానిని 'నిర్వికల్ప' సమాధి యందురు. తాను సమాధి స్థితిలో పొందుచున్న ఆనందము ఆతనికి తెలియకుండినచో అట్టిదానిని 'అసంప్రజ్ఞాత' సమాధి యని యందురు. ఇట్లనేక విధముల సమాధులున్నవి. ఇవి యన్నియు భక్తిని పెంపొందించి వ్యక్తిని ముక్తుని గావించుట కుపకరించును.

—o—

# భక్తి మార్గము

**36. భక్తి యనగానేమి ?**

సర్వచరాచర సృష్టి స్థితిలయకారకుడైన పరమాత్మ యొకడు కలడనియు అతని దర్శన భాగ్యమువలన సర్వపాపములు దుఃఖములు నశించుననియు ఆతని కరుణాకటాక్ష వీక్షణా లేశ ప్రసారముచే ఆనందసాగరమైన మోక్షము లభించుననియు దానితో ఈ జననమరణ ప్రవాహ రూపమైన సంసార దుఃఖము అంతమొందుననియు శాస్త్రపరిచయము వలననో, ఆప్తవాక్యముచేతనో మహాత్ముల అనుభవములను తార్కాణముగ స్వీకరించియో అట్టి మహదానంద ప్రాప్తికై పరితపించుచు ఎంతటి త్యాగమునైనను చేసి ఆ యానందము నందుకొనుటకు సంసిద్ధులమై చేయు అత్యంత తీవ్రప్రయత్నమే భక్తి యనబడును.

మానవుడై పుట్టిన ప్రతివాడును ఈ భక్తిని కలిగి యుండునని చెప్పవచ్చును. ప్రపంచమున గల అన్నిమతములు ఈ భక్తిమార్గమునకు చెందినవియే. జ్ఞాన, కర్మ రాజయోగములు మున్నగు మార్గము లన్నింటికంటె భక్తి యోగము సులభసాధ్యమై అందరికి అందుబాటులో నుండును. సమస్త జీవరాసులయందు ఒక అసాధారణ ప్రేమబంధము విలసిల్లుచుండుట సర్వవిదితము. తల్లిమీద ప్రేమ, బిడ్డమీద ప్రేమ,

భార్యమీద ప్రేమ, యజమానిమీద ప్రేమ, సేవకునిమీద ప్రేమ, బంధువుమీద ప్రేమ, మిత్రునిమీద ప్రేమ, పక్షిమీద ప్రేమ, పశువుమీద ప్రేమ ఇంతెందులకు ఈ లోకమే ప్రేమ స్వరూపమనవచ్చును. ఈ ప్రేమతత్వమునందే భక్తి తత్వము ఇమిడియున్నది. స్వార్థరహితమై ప్రాపంచిక సుఖ దూరమై అనంత త్యాగయుక్తమై ప్రేమ ఎప్పుడు ఒప్పారునో అప్పుడది భక్తి యనబడును. ప్రాపంచిక సంబంధమై మోహముయొక్క ప్రోద్బలముచే ప్రకటింపబడుచున్న ప్రేమ కూడ కొన్ని యెడల గొప్ప త్యాగమును కనపరచును. అట్టి దానిని కూడ భక్తి అనియే నందురు. పతిభక్తి, రాజభక్తి, దేశభక్తి మున్నగునవి యిట్టివేకాని ఈ భక్తి సమగ్రము సక్రమముకాదు.

జీవుడు తల్లిగర్భమున పిండ రూపమున నున్నప్పుడు ఓ పరమేశ్వరా ! ఈ గర్భనరకమునుండి నన్ను తప్పించమని అలమటించుచు దృష్టిబుద్ధిని భగవంతుని పైననే నిలిపి ఆతనినే ప్రేమించుచుండును. జన్మించిన తరువాత ఆ జీవుడు తనపూర్వ ప్రేమను తలిదండ్రులకు బంధుమిత్రులకు గృహక్షేత్రాదులకు మరియు ఇట్టి అనేక విషయములకు పంచియిచ్చును. ఇట్లు ఛిన్నాభిన్నమైన జీవుని ప్రేమప్రవాహమును వెనుకకు మరల్చి తిరిగి భగవంతుని మీదికి ప్రసరింపజేయుటయే భక్తి యన బడును. ఈ భక్తిముందు తలిదండ్రులు భార్యాబిడ్డలు ప్రపంచ మనునది యేదియును లేదు.

37. అట్టి భక్తిని పొందుటకు మార్గమేమి ?

ప్రపంచమున మానవుడు తన దృష్టిలో కనిపించు చేతనా చేతన పదార్థము లన్నింటియందు అధికములైన ఉత్తమములైన వానినే కోరుచు ప్రేమించుచుండును. అట్టివానినే స్మరించుచు వానిని పొందుటకే నిరంతరము ప్రయత్నము చేయుచుండును. ఇది మానవసహజమైన లక్షణము. అట్టి యెడ యీ సర్వచరాచర జగత్తు అంతటికంటె అత్యధికుడును, అనంతశక్తి సంపన్నుడును అనంత ఐశ్వర్య విలసితుడును, అనంతానంద స్వరూపుడును, అనంతుడును నైనవాడు భగవంతుడు అని తెలిసిన మానవుడు ఆ భగవంతుని విడచి అతి స్వల్పశక్తులు గలవానిని ప్రేమించలేడు. అయిన యీ భగవంతుని ఆధిక్యతను మానవుడు ఎట్లు గ్రహించగలుగును? ఎపుడు గ్రహించగలుగును ? అను ప్రశ్న లుదయించును. మానవుడు తన వివేకమును పెంపొందించుకొని స్వాధ్యాయముచేత బుద్ధి వికాసమును పొంది ప్రపంచముయొక్క హేయత్వమును క్షణికత్వమును గ్రహింపవలయును. ఈ ప్రపంచములోని ప్రతి వస్తువు అశాశ్వతమే, క్షణికమే, నశ్వరమే, యని నిశ్చయము చేసకొన్నవాడు భగవంతుని ఆధిక్యతను త్వరగా తెలిసికొన గలడు. అట్లు దేవుని ఆధిక్యతను గ్రహించి ఆతనినే ప్రేమించుచు ఈ సర్వలోకానుభవమును దూరము చేసికొనుచు ఆ దైవానుభవమును పూర్ణముగా పొందుటకుచేయు తీవ్ర

ప్రయత్నమే భక్తి యనబడును. ఇట్టి భక్తిని సంపాదించుటకు మిక్కిలి ధైర్యస్థైర్యములు ఘనమైన త్యాగము ధీశక్తి సర్వసద్గుణములు అన్నియు కలిగియుండుట అనివార్యము. ఇవి యన్నియు కలిగిన అసలైన భక్తులు ప్రపంచమున ఎందరున్నారన్నది ఆలోచించుకొనవలసిన విషయము. ప్రపంచము హేయము తుచ్ఛము అని తెలిసికొన్నవాడు ఈ ప్రపంచమును త్రోసిపుచ్చుట జరుగును. అపుడు ఆ మానవుడు భక్తి యందు ప్రవేశించినట్లు లేక ఆతనికి భక్తి కుదిరినట్లు భావింవవచ్చును. దీనినే జ్ఞానులు జ్ఞానమార్గమని యందురు. ప్రాపంచిక విషయములను త్యాగము చేయనిదే మనుష్యుడు ఏ మార్గము నందును ప్రవేశించినట్లుకాదు. అందుచే భక్తియనగా త్యాగమనికూడ చెప్పవచ్చును. మనస్సు దేవునిపై లగ్నమగుట యందలి తారతమ్యములనుబట్టి భక్తి అనుష్ఠాన విధానమున గూడ భేదము లేర్పడియున్నవి. వానిని శాస్త్రములు ఐదు విధములుగా పేర్కొన్నవి. అవి 1) శాంతభావము 2) దాస్యభావము 3) సఖ్యభావము 4) వాత్సల్యభావము 5) మధురభావము.

శాంతభావమనగా భగవంతుడు సర్వజగత్ ప్రభువని నమ్మి వ్యక్తి తన ధర్మప్రవర్తనముచేత దేవుని అనుగ్రహమును పొందుటకు ప్రయత్నించుట. అట్టివాడు భగవంతుని పట్ల అత్యంతములైన భయభక్తులు కలిగి దేవమూర్తిని సమీ

పించుటకుగూడ నేరముగా భావించుచు దూరదూరమునుండి దేవునకు నమస్కరించుకొనుచు రాజసేవకునివలె ప్రవర్తించుచుండును. దేవాలయములందలి గర్భాలయములలోనికి ఎవ్వరును పోరాదను విధానము ఈ శాంత భావభక్తి ననుసరించియే కలిగినది.

దాస్యభావమనగా భగవానుని తన యజమానిగా భావించి ఆతనికి సర్వసపర్యలు గావించుచు అనగా దేవునకు స్నానము చేయించుట, భగవంతుని పాదములొత్తుట మున్నగు సకలోపచారములు చేయుట యను భావముతో భగవంతుని అర్చించు విధానము. దాస్యభావభక్తి గలవారిలో శ్రీ ఆంజనేయస్వామి ఆదర్శప్రాయుడుగా తీసికొనబడుచున్నాడు.

అటుగాక భగవంతునితో సన్నిహిత సంబంధమును గల్పించుకొని ఆతని తన మిత్రునివలె ఎంచి మెలగుచు సలుపు భక్తి సఖ్యభక్తి అనబడును. ఇదియే కుచేలుని భక్తి. అర్జునుడు కూడ యీ కోవకు చెందినవాడే.

నాల్గవది వాత్సల్యభక్తి. ఈ భక్తి విధానమున పై మూడు విధములలోకంటె భక్తుడు భగవంతునితో మరింత సాన్నిహిత్యమును కల్పించుకొనుటకై ఆ భగవంతుని తన బిడ్డగా భావించి తలిదండ్రులు తమ కుమారునిపట్ల చూపు ఆత్మీయతను ప్రేమను వాత్సల్యమును ప్రకటించుచు ఆ దేవునికి ఉపచారములు చేయుచు భక్తి సలుపును. బాలకృష్ణుని పెంచిన

యశోద యిట్టి భక్తికి చెందినది. వాత్సల్య భావమునకు బాల కృష్ణుని, బలరాముని ప్రధానముగ గైకొందురు. హిందీసాహిత్యమున మహాప్రసిద్ధుడైన సూరదాసు ఇట్టి వాత్సల్యభక్తిని మిక్కుటముగ సాధించి ధన్యుడైనాడు.

ఇక ఐదవది భక్తిమార్గము లన్నింటిలో అత్యంత ముఖ్యమైనది. దీనిని దాటుటతోడనే అద్వైతమార్గమునకు త్రోవ కనిపించును. ఇదియే మధురభక్తి అనబడును. ప్రపంచమున ఎన్ని యిక్కట్టులు వచ్చినను తెగిపోని మధురబంధముతో పెనవేసికొనియుండు భార్యాభర్తల నడుమ విలసిల్లు ప్రేమయే యీ మధుర భక్తిభావము. ఇంతకుమించిన సన్నిహితత్వము మరియొకటి లేదు. ఇంతకుమించిన సుఖదాయకము ఆనంద దాయకమునైన బంధము మరియొకటి లేదు. ఈ మధురభావము ఎంతటి త్యాగమునకైనను సిద్ధమగును. రాధాకృష్ణుల దివ్యప్రేమయు, గోపికల ప్రేమభావమును, భక్త మీరాబాయి సాధించినదియును ఈ మధురభక్తియే-ఇట్టి ఐదువిధములైన భక్తిమార్గములను 'మర్కటకిశోరన్యాయము' అని శాస్త్రజ్ఞులు పేర్కొనుచున్నారు.

ఈపై ఐదు మార్గములలో భక్తునకు స్వాతంత్ర్యము అధికము. కాని భగవంతునిపై ఆధారపడియుండుట అరుదు. భగవంతుని భక్తితో తనంత తాను స్వాధీనపరచుకొనుటయే యిందలి ప్రత్యేకత. అట్లుగాక కేవలము భగవంతునిపై ఆధార

పడి యుండుటను 'మార్జాల కిశోర న్యాయము' అని పెద్దలు చెప్పుచున్నారు. శ్రీరామకృష్ణ పరమహంస ఈ మార్గముననే ప్రయాణించినాడు. ఇందేలోభమును కానరాదు. మార్జాలము తన పిల్లలను కాపాడినట్లు తనభక్తుల నాదేవుడే కాపాడును. భగవంతుడు సృష్టి, స్థితి, లయ కారకుడు. పురుషవాచ్యుడుగ పైన చెప్పబడిన భగవానుడు స్త్రీ వాచకుడునై 'భగవతి' యన బరగుచున్నాడు. అనగా శక్తి సహాయము లేనిదే ఆతడేమియు సృజింపలేడు. అట్టి శక్తిని నిష్కల్మషముగా ఆరాధించుటయే యుండవలె భావము. ఈ యారు మార్గములలో భగవంతుని పూజించుచు, ప్రేమించుచు, ఆతనికై సర్వమును త్యాగమొన ర్చుచు అతని అనుగ్రహమును, దర్శన, స్పర్శన, భాషణ భాగ్య ములను పొంద యత్నించుటయే పరమార్థము.

**38. దేహ పతనానంతరము భక్తుడు పొందు అవస్థ యేది ?**

భక్తి యోగమందున్న భక్తుడు శరీర త్యాగానంతరము మోక్షమందును. ఇట్టిమోక్షము నాల్గువిధములుగ విభజింప బడినది. 1. సాలోక్యము 2. సామీప్యము 3. సారూ ప్యము 4. సాయుజ్యము. ఇందు ఒకదానికన్నను మఱి యొకటి శ్రేష్ఠమైనది.

సాలోక్య మోక్షము ప్రకారము భక్తుడు భగవంతుని లోకమున వసించుట యను సిద్ధి కలుగును. అట్లుగాక భగ వంతుని గృహముననో లేక ఆతని యూరనో దగ్గరగా వసిం

చుట సామీప్యము, ఇంకను నధికుడగు భక్తునకు భగవంతుని రూపము కలుగును. అనగా నాల్గుచేతులు మున్నగు వివిధ రూపములు లభించును. ఇదియే సారూప్యము అనబడును. పై మూడు విధముల కన్నను అధికమగు భక్తుడు సాయుజ్యము నందును. అనగా భగవంతుని శక్తులలో కొన్నింటిని పొందును. భక్తిమార్గము ననుసరించిన భక్తుడు భగవంతుడుగ నగుటకు వీలులేదు. భక్తుడు . జీవుడు వేర్వేరు వారు అనుటనే 'ద్వైత భావము' అందురు. ఇట్లుగాక "అహంబ్రహ్మాఽస్మి" నేనే బ్రహ్మమును అను స్థితికి ఏముముక్షువు చేరునో అట్టివానిని జ్ఞాని అందురు. ఆతడవలంబించు మార్గమే జ్ఞానమార్గము.

**39. జ్ఞానయోగము అనగానేమి ? అది పొందుట అందరకు సాధ్యమా ?**

అజ్ఞానమునుండి తొలగుటయే జ్ఞానము. అజ్ఞానమును 'చీకటి' – అను పదముద్వారా నిర్వచింపవచ్చును. మరి చీకటి అనగానేది ? బాహ్యముగా కంటికి కనిపించునది కాదు. అది మానసిక సంబంధమైనది. అనగా జీవాత్మ పరమాత్మల కభేద తత్త్వము గోచరించుట. జీవుడు తాను పరమాత్మ స్వరూపమగు బ్రహ్మమయ్యు తాను బ్రహ్మము కాడనియు, భగవంతుడనువాడు వేఱొకడు కలడనియు – తాను సంసార సుఖదుఃఖ యుక్తుడగు మూఢుడనియును భ్రాంతి చెందును. ఇదియే మాయ. ఈ భ్రాంతినే అద్వైతులు రజ్జు సర్పభ్రాంతి

యనుచున్నారు. అట్లుగాక ఆ భ్రాంతి (చీకటి; అజ్ఞానము) నుండి వెలువడి తానే బ్రహ్మమని గ్రహించి (జ్ఞానము) అనిర్వచనీయానందము నందుటయే జ్ఞానయోగము అని అద్వైత జ్ఞానులు పలుకుచున్నారు.

వేదాంతతత్వవిదుడగు గురువు జీవునకు "తత్వమసి"- అని బోధించును. తత్ త్వం అసి - ఆ బ్రహ్మము నీవు అగుచున్నావు అని ఆ మహావాక్యమున కర్థము. ఆ వాక్యమును జీవుడు వినును. దీనినే శ్రవణము అందురు. ఆ వాక్యమును వినినపిమ్మట దానిని "మననము" చేయును. అట్టి మనన పూర్వకమగు వాక్యము "అయమాత్మా బ్రహ్మ" ఈ ఆత్మ బ్రహ్మముగా నున్నది - కావున నేనే బ్రహ్మమును అని తీర్మానించుకొని "అహం బ్రహ్మాస్మి" - అనును. తరువాత ఆనందములో స్థిరమైన సందేహరహితమైన స్థితిలో నుండును. దీనిని నిధిధ్యాసనము అందురు. అద్వితీయానందమున మునిగి బాహ్యప్రజ్ఞ లేకుండ నుండును. ఈ స్థితిని సూచించుటకు "ప్రజ్ఞానం బ్రహ్మ" - అను నాల్గవవాక్యము సూచింపబడినది. ఈ నాల్గు వాక్యములను మహావాక్య చతుష్టయము అందురు. ఇవి శిష్యుని గురువునంతటి వానిగా చేయును.

ఈ చెప్పిన శ్రవణ మనన నిదిధ్యాసనముల నాచరించి, అనుభవించి"అహం బ్రహ్మాస్మి" - అనువానిని జ్ఞాని, బ్రహ్మవిదుడు, జీవన్ముక్తుడు అను నామములతో వ్యవహారింతురు.

అనగా అజ్ఞానము నశించి జ్ఞానము వెల్గినది. అట్టి జ్ఞాని మరల జననమరణ ప్రవాహ రూపమగు సంసారమునకు రాడు. ఆతడు జన్మరాహిత్యమునందును. అట్లయిన ఈ జ్ఞానమార్గము ఎంద ఱకు సాధ్యమగును - అందరును గ్రహింపగలరా! యనునది యొకప్రశ్న. దానిని పరిశీలింతము.

జ్ఞానయోగము అందరకు అసాధ్యము, కష్టతమము. అది బ్రహ్మవిద్యతో కూడియున్నది. ఈ మార్గమున కింత కష్టము వచ్చుటకు కారణమును చూతము. న్యాయదర్శనము-వైశేషికము - సాంఖ్యము - యోగము - పూర్వ, ఉత్తర మీమాంసలు అనబడు షట్ దర్శనములును, వేదభాగము లగు ఉపనిషత్తులును, బ్రహ్మసూత్రములును వానికి సంబంధించిన భాష్యములును, ఇతర పండిత గ్రంథములును సంస్కృత భాషలో రచింపబడియున్నవి. సామాన్యప్రజల కర్థమగు రీతి వీనియందు గోచరింపదు. పై గ్రంథములు చదువనిదే జ్ఞాన యోగము గమ్యముకాదు. అంతియేకాక జ్ఞానమార్గము త్యాగ ప్రధానమైనది. సంసారబంధమును ఛేదించి - మోక్షము నాశించి సన్యాసులైనవారలే ఆ సంవిధానమును గ్రహింప గలరు. ఎందఱు ఇట్టి త్యాగమున కనుకూలముగ నుందురో! ఈ మార్గమునకు సంబంధించిన యమ నియమాదులను గ్రహించినవారు సహితము త్యాగహీనులగు ప్రజలకు బోధింపరు. త్యాగహీనమును అనుభవరాహిత్యమునునైన విద్యకు పరిపూర్ణ

త్వము లేదనునది వారి సిద్ధాంతము. అందుచే జ్ఞానమార్గము సాంసారికజీవనము గడపు సామాన్యులకు అగమ్యము - అగ్రాహ్యామునని చెప్పక తప్పదు.

దీనికి తోడు ఈ విద్యయందు అభివృద్ధి పొందవలెనని ఆశించినవారికి శ్రీ శంకరాచార్యులు "అబ్బాయీ ! నాలుగు విషయములను ముందుగ నేర్చుకొనుము" - అనినారట - ఈ నాల్గువిషయములనే సాధన చతుష్టయము అందురు.

**40. సాధన చతుష్టయమనగా నేమి ?**

1. వీనిలో మొదటిది నిత్యానిత్య వివేకము. నిత్యపదార్థమేదియో, అనిత్య పదార్థమేదియో గ్రహించుట. అనిత్యమును ముందుగ పరిశీలించిన పిదప నిత్యము గోచరించును. అనిత్యము - నిత్యముకానిది. అనగా శాశ్వతత్వము లేనిది. అట్టిదేది ? కంటికి కనిపించు ప్రతి వస్తువును అనిత్యమే. అందులకే శాస్త్రకారులు "యద్దృశ్యం తన్నశ్యతి" అని యుద్ఘాటించినారు. ప్రపంచమున దృశ్యములగు జీవరాసులలోను - వస్తువులలోను శాశ్వతముగ నిలచునదేదియు లేదు. అందులకే గౌతముడు బాహ్యమున ముదుసలిని చూచి తన భార్యయు నట్లగుననియు, ఆమె సౌందర్యము నశ్వరమనియు భావించి నిత్యపదార్థ సంపాదనకై కృషియొనర్చి సఫలీకృతుడైనాడు. నిన్నటి దినమున మిక్కిలి ప్రేమతో ధనము ధారవోసి కొనిన పుష్పములు మరునాటికి వీధులపాలు కావలసినవే కదా !

మఱి ఇహలోక సంబంధములుగాక పరలోక సుఖములు నిత్యములని భావింతురేమో ! పుణ్యవిశేష ముండునంతకాలమే అదియును నిలచునది. పిదప నరకమునకు హేతువేకదా - కాన ప్రపంచమున నయన గోచర పదార్థజాల మనిత్యము. ఇక నిత్యమేది ? నిత్యమొక్కడే. అదియే బ్రహ్మము - అనగా భగవద్విషయము. ఇట్టి వివేకమును కలిగియుండుటే నిత్యానిత్య వస్తు వివేకమనబడును. ఇది జ్ఞానమార్గమున ప్రథమ సోపానము

2. ఇంతటి వివేకము కలిగినపిదప మానవుడు త్యాగానికి సన్నద్ధుడగును. ఇహలోక సుఖములు - పరలోక భోగములనిత్యములని గ్రహించి వానియందలి కాంక్షను విరమించుకొని నిత్యత్వమునకు మార్గములను వెదకుటకు పట్టుదల కల్గియుండును. పరలోక సుఖములనే అముత్రములందురు. అందువలననే సాధన చతుష్టయములో రెండవది "ఇహాముత్ర ఫలభోగ విరాగము" అనబడుచున్నది. దీనినే ఒక్కమాటలో వైరాగ్యమన వచ్చును, వివేక వైరాగ్యముల కవినాభావ సంబంధముకలదు. వివేకము సక్రమమైనచో వైరాగ్యము దానిననుసరించును. వివేకములేని వైరాగ్యమును, వైరాగ్యములేని వివేకమును నిష్ప్రయోజనములు. శాస్త్రమున చెప్పబడిన ప్రకారము శాస్త్రాభ్యాసము - స్నానసంధ్యాదికము - గురుభక్తి - బ్రహ్మచర్యము సత్సాంగత్యము - అహంకార త్యాగము - గృహస్థాశ్రమము

వానప్రస్థాశ్రమములందు క్రమ పరిణతిపొంది - దారేషణ - పుత్రేషణ - ధనేషణములను ఈ షణత్రయములను వర్జించి సన్యాసమును పొందుటయే వైరాగ్యము. ఇది సాధన చతుష్టయమున ద్వితీయ సోపానము.

3. ఇక మూడవయది "శమాదిషట్కము" ఇవి యారు. శమము - దమము - ఉపరతి - తితిక్ష - శ్రద్ధ - సమాధానము అనునవి. వీనిలో మొదటిది "శమము" అనగా అంతరింద్రియ నిగ్రహము - ఇంద్రియములు పదునొకండు. జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు - పైనొకటి మనస్సు. ఇందు జ్ఞాన, కర్మేంద్రియములు బాహ్యములు - మనస్సు అంతరింద్రియము. కాన మనస్సును నిరోధించుటయే శమము. చిత్తశాంతిని నశింపజేయు కామాదిషట్కమును కామ - క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్యములను దూరముచేసి - చిత్తమౌన రూపమున శాంతిని పొంది ప్రాపంచిక విషయములను వీడియుంటయే శమము.

"దమ"మన బాహ్యేంద్రియ నిగ్రహము. అనగా పై చెప్పిన జ్ఞాన కర్మేంద్రియములను నిరోధించుట. ఇంద్రియములలో నొక్కొక్కదాని కొక్కొక్క ప్రవృత్తి యుండును. వానిని అనవసర కార్యములకై వినియోగింపక భగవచ్చింతనయందే నియమించి అదుపులోనికి తెచ్చుటయే దమము. ఆధ్యాత్మికాభివృద్ధి కుపయోగింపని యింద్రియములకు సార్థకత లేదు.

"ఉపరతి" యనగా పైన ఆనందము ననుభవించుట. కాని పై ఆనందము, క్రింది ఆనందము అను రెండు పద్ధతులు కాదు. అవి బాహ్యాంతర రతులు. బాహ్యేంద్రియములగు కర్మ జ్ఞానేంద్రియములతో మనకన్నను బాహ్యముగనున్న ప్రపంచమును చూచి ఆనందించుట బాహ్యరతి. చూచిన విషయమును స్మృతికి తెచ్చుకొని ఆనందించుట అంతరరతి. ఈ రెండును దైవసంబంధ మగునట్లు చూచుకొనుట కర్తవ్యము. అనగా బాహ్యప్రపంచమును మరచి అంతరంగమున ఆధ్యాత్మిక చింతనతో ఆనంద మనుభవించుటయే ఉపరతి. ఈ చెప్పిన మాటియందును శ్రేష్ఠము ఉపరతి. శమదమాదులు ఉపరతికి పునాదులు.

శమదమాదులు సులభములు కావు. వీనికి అంగములు "తితిక్ష" - "శ్రద్ధ" - "సమాధానము" లనునవి. వానిని పరీక్షింతము. "తితిక్ష" యను మాటను సహనము, ఓర్పు, క్షమ అను పదములతో అర్థమును చెప్పవచ్చును. అనగా విరుద్ధభావనలు కలిగినను సహించి సాధనయందు మునిగియుండుట. భగవంతుడు భక్తుని పరీక్షించుటకై, క్షమను కలుగజేయుటకై అనేక ఆటంకములను కలిగించును. అట్టి సమయమున కోపతాపములను పొందరాదు. త్రిగుణములలో నొకటియగు సత్వమును తితిక్ష ఆశ్రయించి యుండును. బాహ్యప్రపంచమునుండి వచ్చు సమస్త ఆటంకములను లక్ష్యముసేయక ఉదాసీన భావముతో వికారములేక స్థిరముగా నుండుటయే తితిక్ష.

అట్టి తితిక్షను సాధించుటకు ముఖ్యమైనది "శ్రద్ధ" శ్రీకృష్ణుడు గీతలో "శ్రద్ధావాన్ లభతేజ్ఞానమ్" అని పల్కినారు. శ్రద్ధ లేనివారికి భక్తియు, భక్తిలేనివారికి జ్ఞానమును శూన్యములు. అందుచే ఆధ్యాత్మిక సాధమునకు శ్రద్ధయే పునాది. ఇది నాలుగు విధములు. ఆత్మ - మార్గ - గురు - భగవద్విశ్వాసములు. ఆత్మవిశ్వాసమనగా సాధకుడు తన శక్తిసామర్థ్యములతో ఆధ్యాత్మిక గమ్యమును చేరగలనను ధైర్యమును పొందుట. మార్గవిశ్వాసమనగా తాను చేరవలసిన గమ్యమునకు తగు మార్గము నెన్నుకొని అందే ప్రయాణించుట. పిదప సరియైన గురువును వెదకికొని పరీక్షించి వారి అడుగు జాడలనే అనుసరించుట గురు విశ్వాసము. పై విశ్వాసములకు మూలకారణమగు భగవంతుని పొందుటకై త్యాగమొనర్చుట కడపటిదగు భగవద్విశ్వాసము. ఇట్లన్నిరకముల విశ్వాసము కల్గియుండుటనే శ్రద్ధయని యందురు.

శమాదులలో కడపటిది "సమాధానము." సమాధానమనగా నిర్వికారత లేక నిశ్చలత. అన్ని విధముల సాధన జేసి పై లక్షణములను పొందినను మఱికొన్ని బలహీనతలు మార్గమున కంటకములుగ నిలచియుండును. వానిని తొలగింపవలయును. పూర్వ జన్మార్జితములైన కుసంస్కారములు విడిపోయి మనస్సునకు బాధను కల్గింపకున్నచో నీ సమాధిస్థితి లభించినట్లగును. ఆ ఆటంకములు తొలగిపోకున్నచో నీ మార్గము సుకరము కాదు. సాధకులు అనేకు లిచటనే మోసపోవుదురు.

సాధన చతుష్టయములో సంపత్తిలో నాల్గవయది "ముముక్షుత్వము". దీనిని సమస్త ఆధ్యాత్మిక శాస్త్రసార మన వచ్చును. సాధన చతుష్టయము నందలి వివేక వైరాగ్య శమాదులు ముముక్షుత్వము లేని యెడల నిష్ప్రయోజనము లగును. సాధనయొక్క అభివృద్ధి మూడు ముఖ్యలక్షణముల ద్వార ప్రకటితమగుచుండును. వానియందు మొదటిది ధార్మిక జీవితము. ధార్మిక జీవితమనగా మానవునకు ప్రపంచముతో నుండు సంబంధములు నిర్మలముగ నుండుననుట దీనిని నైతిక జీవితమనికూడ అందురు. ఇట్టి నైతికబలము లేని వానికి ఆధ్యాత్మికబలము సంప్రాప్తించదనియే చెప్పవచ్చును. ఎవని యందు యమములు సంపూర్ణముగనుండునో వాని జీవితమే నైతిక జీవితము కాగలదు. యమమునందు ఆవంతయైనను ప్రవేశింపక కేవలము కాషాయములు మాత్రము ధరించి వేష ములు వేయు సన్న్యాసులు గురువులు మున్నగువారు గొప్ప మోసగాండ్రు మాత్రమే యగుదురు. అందుచే ఆధ్యాత్మిక జీవితమును నొందదలచిన వాడు మొట్టమొదట మంచి ప్రవ ర్తన గలవాడు కావలయును. సాధనయందలి రెండవ ముఖ్య విషయము వైరాగ్యము. మానవుడు ప్రపంచమున తన ప్రవ ర్తనను ప్రపంచముతో తన సంబంధమును పవిత్రము చేసికొను కొలది ప్రపంచము నందలి లోపములు దోషములు ఆతనికి స్పష్టముగ గోచరములగును. అందుచేత అతడు ప్రపంచ సంబంధములు తగ్గించుకొనుటకు ప్రయత్నించును. అటుపై

ఈ ఐహిక సంబంధములు ఆధ్యాత్మిక జీవితమునకు ఆటంకము లని అతడు తెలుసుకొనును. అట్లు మానవుడు బంధుమిత్ర కళత్రాది బంధములు గలిగి పలువిధముల అనుభవములను పొందిన పిదప నైతిక జీవితమును అటుపిమ్మట ఆధ్యాత్మిక జీవితమును అందగలుగుచున్నాడు.

పై చెప్పిన విధమునగాక గతజన్మల సంస్కారముల బలము చేతను సద్గురువుల బోధచేతను యితరుల జీవితములలోని అనుభవములను గమనించుటచేతను ఐహిక సంబంధములయందు ఆశక్తిని నశింప జేసికొనుచు వైరాగ్యము పొందువారు కొందరుందురు. ఈ వైరాగ్యము మానసికముగను లౌకికముగను రెండు విధములుగను నుండవలయును. అపుడే మానవుడు ఆధ్యాత్మిక జీవితమునందు అభివృద్ధిని సాధించగలడు. ఇక సాధనయందలి మూడవ విషయము దైవభక్తి. జగత్తునకు మూలము భగవంతుడని నమ్మి ఆతని దర్శన స్పర్శనాదులు పొందవలయునని యత్నించుటయే దైవభక్తికి అర్థము. దీనినే మరియొకమాటలో ముముక్షుత్వమని యందుము. మోక్షమును కాంక్షించువాడు ముముక్షువు అనబడును. మోక్షము అనగా ముక్తి లేక బంధమునుండి విడివడుట అని యర్థము. బంధమనగా సంసారము. సంసార సుఖములు క్షణికములని, వీనియందు కల్గు కష్టనష్టములలో తాదాత్మ్యము చెంది బాధపడుట యుక్తము కాదనియును, జననమరణ పరం

వరనుండి వెలువడవలెననియు శాశ్వతానందమును పొందవలె ననియు భావించి, అందులకై ప్రయత్నించుటను ముముక్షుత్వ మని యందురు. ఆధ్యాత్మికాభివృద్ధి సమగ్రముగ నుండవలె ననిన ముముక్షుత్వము సంపూర్ణముగ నుండవలెను. ప్రవర్తన, విరాగ, ముముక్షుత్వము లొకదానిపై నొకటి యాధారపడి యున్నవి.

ముముక్షుత్వము తీవ్రము - మధ్యమము - మందము అతిమందము - అని చతుర్విధములుగ నున్నది. రామకృష్ణుడు వీనిని ఒక ఉపమానంతో చక్కగా వివరించి యున్నాడు.

ఎద్దులవారు ఎద్దుల పరీక్షకై పోవుదురు. అందు శయనించిన ఒక యెద్దువద్దకు పోయి దానిని పరీక్షించుటకై అది నిలచిన దనుక బాధింతురు. పిమ్మట వేఱొక దానిని చూతురు. అది పెద్ద బాధలకు గురికాకుండ నిలచియుండును. వేరగాండ్రు మఱియొక దానిని చూచును. అది దెబ్బలకు గురికాక వారు సమీపింపగనే నిలబడును. ఇంకొకటి వీరిని చూడగనే నిలబడును. ఇందు నాల్గవది తీవ్రజాతికి చేరినది. ఇట్లే మిగిలినవి మధ్యమ - మంద - అతిమంద జాతులకు చేరినవై యున్నవి. అదే విధముగ సాధకులలో నిట్లే యుందురు.

మానవుడు నానావిధ తాపత్రయ విచార మగ్నుడై సంసార సుఖహీనుడై, సర్వమనర్థమని భావించి, వేఱొకరిచే చెప్పించుకొనక తనకు తానె సర్వసంగ పరిత్యాగియై విరాగి

యగును. వైరాగ్యమును పొందును. ఇది తీవ్రము. మఱి కొందరు బాహ్య సుఖమనిత్యమని గ్రహించియు పుత్రకళత్ర బంధుజనముల విడువ మనసురాక రెంటికిని మధ్య కొట్టు మిట్టాడుచుందురు. ఇది మధ్యమము. మోక్షమును పొందుటకు త్వరపడనేల ? నాకింకను కాలము చాలగలదు. సర్వసుఖం అష్టైశ్వర్య భోగానంతరమే అందులకై ప్రయత్నింతును'' అను భావమును పొందుట మందము. సకల ఐశ్వర్యములు తలపకయే లభించునట్లు మోక్షమును తలపకయే లభించినచో కృతార్థుడనగుదునని భావించుట అతిమందము.

ఇట్టి నాల్గువిధములలో తీవ్రమున యీ జన్మలోను, మధ్యమమున మరుజన్మమందును, మందమున యుగాంతరమునను మోక్షమందగలరు. కాని అతిమందమున కోటి కల్పములనైనను మోక్షము నందలేదు. కాన ప్రతిమానవుడు పై విధానములలో ప్రథమమునకే ప్రాధాన్యమిచ్చి సద్గురువునుండి గ్రహించి జన్మ సార్థకము చేసికొనుట శ్రేష్ఠము.

41. సద్గురువు అనగా నెవరు ? లక్షణములేవి ?

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవోమహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః"

గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే ఈశ్వరుడు, గురువే సాక్షాత్తు పరబ్రహ్మము. అట్టి గురువు ఎట్లుండవలయుననిన వేదార్థ పరిజ్ఞానము, బ్రహ్మనిష్ఠ, శాంతి, సమానదృష్టి

కలవాడును ఇది నాదియనియు ఇది నీదియనియు భేదభావము లేనివాడును, సుఖదుఃఖములకు లోబడనివాడును; ఏకోర్కెలు లేనివాడును, పరిశుద్ధతత్వము గలవాడును శిష్యునకు బోధించు సమర్థతగలవాడును, శిష్యుని తరింపజేయవలయునను దయగల వాడును సద్గురువని చెప్పబడును.

భగవంతుని భక్తులు యమనియమములద్వార వేదోక్త విధిని పూజింపగా పరమేశ్వరుడు సాక్షాత్తు గురురూపమున దయచేసి మనకన్నులకు కానుపించి ఆత్మతత్వమును భోధించుచున్నాడు.

గురువు శబ్దమునకు పెద్దలు చెప్పినదేమన
" 'గు' శబ్దస్త్వంధకారస్యాత్ 'రు' శబ్దస్తన్ని రోధకః,
అంధకార నిరోధిత్యాత్ గురురిత్య భిధీయతే" ॥
సంసార సముద్రమునుండి లేవదీయువాడే గురవు.

'గుః' అనగా అంధకారము లేక అజ్ఞానము; 'రుః' అనగా దానిని పోగొట్టువాడు. ఇట్టి గురుపూర్ణ కటాక్షవీక్షణ ముల కొరకు మానవులందరు ప్రయత్నింప వలయును.

"అవిద్యా హృదయగంధి బంధమోక్షో భవేద్యతః
తమేవ గురురిత్యా హుద్గురు శబ్దార్థ వేదినః"

అనగా ఎవరు అజ్ఞానముచే కలిగిన అహంకారమను బంధమునుండి విముక్తిని గల్గింతురో వారే గురువులు అని పెద్దలవాక్కు. . ఇక ఎటువంటి గురువును సేవింపవలయుననిన

"బంధముక్తం బ్రహ్మనిష్ఠంకృత కృత్యంభజేద్గురుం। యస్య ప్రసాదాత్ సంసారసాగరో గోష్పదాయతే" ॥ అనగా బంధమునుండి విడివడిన వాడును, బ్రహ్మనిష్ఠుడును, సమాధి నిష్ఠుడును, కృతకృత్యుడునైన గురువును మనము సేవించ వలయును. ఇట్టి గురువును శిష్యుడు ఏవిధమున భావింప వలయుననిన "యథాదేవోతథాగురో" గురుడే దైవమనియు, దైవమేగురుడనియు భావించవలయునేగాని యిరువురిలో స్వల్పమైన భేదభావమున కనిపించరాదు.

ఇట్టి సద్గుణములుగల గురువులు మానవకోటిలో అరుదుగ నుందురు. వారిలో సిద్దయ్య అదృష్టమున సద్గురువు సాక్షాత్తు పరబ్రహ్మయైన బ్రహ్మముగారు గురువుగా లభించుట వారి పూర్వజన్మ సుకృతంబే గదా! యిప్పటికిని బ్రహ్మముగారు ఉపదేశించిన "కాలజ్ఞానము" జరుగుచున్నట్లుగా తెలియుచున్నదిగదా! అదే విధముగ వివేకానందుని అదృష్టమున సాక్షాత్తు దైవ స్వరూపులైన శ్రీరామకృష్ణ పరమహంస లభించుట వారి అదృష్టమేగదా! ఈ విధముగనే అర్జునుని అదృష్టమున జగద్గురువు, పరిపూర్ణావతారులైన శ్రీకృష్ణ పరమాత్మ గురువుగా లభించెను. సిద్దయ్యకు, వివేకానందునకు, అర్జునునకు శిష్యులకు వుండదగిన లక్షణము లన్నియు కనబడెను. అర్జునుడు యీలోక సుఖములను పర లోక సుఖములను కోరలేదు. "నేను నీకు శిష్యుడను. దుఃఖ

ములో నున్నాను. మోహము అనెడి వలలో దగులుకొని యున్నాను. నన్ను మంచిమార్గమున నడిపించుము. అని కోరి యున్నాడు. అతడు శత్రువులందును వైరభావంబులేక తాను చంపబడుటకుకూడ సిద్ధముగా నున్నాడు. అర్జునుడు శ్రీ కృష్ణుని స్నేహాబుద్ధిని బంధుభావమును వదలి వినయ వివేక ములతో ఆ శ్రీకృష్ణ పరమాత్మనే గురువుగా నంగీకరించెను.

ఇట్లేగదా! లక్ష్మణుడు శ్రీరాముని సమీపించినది.

"కదా చిదేకాంతము పస్థితం ప్రభుం రామం రమా లాలిత పాద పంకజం ।
సౌమిత్రిరాసాదిత శుద్ధభావనః ప్రణమ్య భక్త్యావిన యాన్వితోఽ బ్రవీత్॥"

(శ్రీరామ గీత)

పైన చెప్పిన సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించు టచే శుద్ధమైన మనస్సు కలవాడై లక్ష్మణుడు ఏకాంతముగ శ్రీరామునకు నమస్కరించి వినయముతో యీవిధముగా చెప్పెను.

"అహం ప్రపన్నోఽస్మి పదాంబుజం ప్రభో, భవాపవర్గం తవయోగిభావితమ్
యథాంజసాజ్ఞాన మపార వారిధిం, సుఖం తరిష్యామితథాను శాధిమామ్"

అనగా స్వామి! (రామచంద్రప్రభో) నీవే నాకు శర ణ్యము, నీకే ప్రపన్నుడనైతిని నా అజ్ఞానము పోవునట్లుగా

